59



ఈ దేశం మనస్సులో అందమైన కల
జనం పోరులోలేచిన కత్తిలాంటి అల
మనిషంటే ఎంత ప్రేమ!
'కొత్తమనిషి' చారు—
జనం గుండె పోరు—
నెత్తుటి తుఫానులో
ఎత్తిన జెండా దించక
లాంగ్‌మార్చ్! లాల్‌సలామ్!!

— అనల

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

ఆగస్ట్ 1974

**59**

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

1 రూపాయి

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J.P.N. Road, Warangal-506002 (A.P.)

# ఐక్యత మన నినాదం - పోరాటం మన కర్తవ్యం

ప్రజలు తమ హక్కుల్ని సాధించుకునే పోరాటాలు పదునెక్కుతుంటే పాలక వర్గాల దమననీతికూడ పాశవికమవుతుంది. మరీ ముఖ్యంగా యీ పోరాటాలు వర్గ చైతన్యంతో నిర్వహించబడినపుడు దోపిడీవర్గాల నీతి, ధర్మం, అహింసా ప్రవచనాలు అన్నీ ఆయుధాన్నే అడ్డంపెట్టుకుంటాయి. 'ప్రజాస్వామ్య' మనే మాట వర్గసమాజంలో రాజ్యాధికారం ఏ వర్గం చేతిలోవుంటే ఆవర్గం నియంతృత్వమే తప్ప వేరుకాదు.

ఆలోచించడానికీ ఆలోచించినమాటల్ని చెప్పడానికీ సభలు, సంఘాలు, పత్రికలు పెట్టుకోవటానికీ హక్కువుండాలని కోరుకోవడం, ఆ హక్కును అన్నిటికన్నా ప్రాణప్రదంగా నిలబెట్టుకోవడం బుద్ధిజీవులందరి స్వభావం, కర్తవ్యంకూడ. బూర్జువా రాజ్యాంగాలుకూడా పొందుపరచిన ప్రాథమికమైన హక్కులు వాక్, సభాస్వాతంత్ర్యాలు. ఈ స్వేచ్ఛను పాలకవర్గాలు తమ దోపిడీ సజావుగా సాగినంతకాలమే, ఆమేరకే యిస్తాయి. రాజ్యాంగయంత్రం, జైళ్ళు, సైన్యం అన్నీ యీ పాలకవర్గాలపనిముట్లే.

కార్మికవర్గం చైతన్యవంతమైన పోరాటాలను నిర్వహించి, సాధించుకున్నసమ్మె చేసే హక్కును నిషేధించి, రైల్వేకార్మికుల పోరాటాన్ని పోలీసు, మిల్ట్రీ, గూండా బలగాలతో, రివిజనిస్టు నాయకత్వం మిలాఖతుతో యీ ప్రభుత్వం ఎంత దారుణంగా అణచివేసిందో ఇంకా చల్లారని సత్యం. సమ్మెలో పాల్గొన్న రైల్వేకార్మికుల జీవితాలతో యింకా కక్షసాధింపు చెలగాటాలాడుతూనే వున్నది కేంద్రప్రభుత్వం.

కాశ్మీరు ప్రజలకు, నాగా, మిజో జాతులకు స్వయంనిర్ణయ హక్కులేదు. బంగ్లా ప్రజల స్వయంనిర్ణయ హక్కును గురించి మాత్రం బాకాలూదే ప్రజాస్వామ్యం మనం అనుభవిస్తున్నాం. దళితులకు, సమాజంలో అణగారిన వర్గాలకు, రాజకీయ, ఆర్థిక సమానతలు అటుంచి సాంఘిక, సాంస్కృతిక వికాసానికికూడా నోచుకునేహక్కులేదు. అగ్రవర్ణాల ధర్మపరిబోధాల స్వేచ్ఛమాత్రం విశృంఖలం.

ఆస్తిహక్కును తాను భద్రపలచుకొని, ఆకలి, నిరుద్యోగం, అజ్ఞానం అనుభవించేహక్కుల్ని ప్రజలకు విదిలించిన పాలకవర్గాల స్వభావాన్ని ప్రజలు పసికట్టారు. కన్నీళ్ళతుడుపుగావున్న వాక్, సభాస్వాతంత్ర్యాలుకూడ పోరాటంలేకుండా సాధించుకోలేమని ప్రతి క్షణం అనుభవం చెప్తూనేవున్నది.

నక్సల్‌బరీ, శ్రీకాకుళం, రైతాంగ సాయుధపోరాట ప్రజ్వలనాలతో ఉత్తేజాన్ని పొంది కన్నీళ్ళు, అసమానతలు, దోపిడీ దౌర్జన్యాలులేని సమాజంకోసం, మావో

ఆలోచనా విధానాన్ని తమ విధానంగా ప్రకటించుకున్న విరసం రచయితల నోర్లు నొక్క-డానికి యీ నాలుగు సంవత్సరాలకాలంలో యీ ప్రభుత్వంచేసినకుట్రను చివరకు కోర్టులు కూడ కాపాడలేకపోయాయి. విప్లవ రచయితల సంఘం భారత ప్రజాయుద్ధంలో సాంస్కృతిక బాధ్యతను చేపట్టింది. రైతాంగ విముక్తికి సాయుధపోరాటం ప్రధానమార్గంగా విశ్వసిస్తున్నది. ఈ సంఘం ప్రణాళికల్లోగాని, తీర్మానాల్లోగాని. కార్యక్రమాల్లోగాని దాపరికంలేదు, రహస్యంలేదు నిర్ద్వంద్వంగా, నిర్దిష్టంగా యీ విషయాలను వాళ్ళు బహిరంగంగా ప్రకటిస్తూనే వున్నారు. ప్రజల విప్లవమార్గాన్ని బలపరచే చారిత్రిక బాధ్యతను మేధావులుగా, రచయితలుగా వాళ్ళు నిర్వహిస్తున్నారు. భారత దేశంలో సాయుధపోరాటాన్ని నిర్వహిస్తున్న పార్టీల, బలపరుస్తున్న విప్లవ రచయితల మధ్యన వుండే సారూప్యం లేదా సామీప్యం రెండూ మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనా విధానం చేపట్టడంలో వుంది. విప్లవ రచయితలు రాసినందువల్ల శ్రీకాకుళ గిరిజనులు సాయుధపోరాటాన్ని చేపట్టలేదు భారత రైతాంగ వ్యవసాయ విప్లవంతో ఉత్తేజాన్ని పొంది విరసం ఆవిర్భవించింది. దేశం నలుమూలలా రైతాంగం సాయుధ పోరాటం చేపట్టడానికైనా, కష్టజీవులచేతికి రాజ్యాధికారంవస్తేనే కష్టజీవుల సమస్యలు పరిష్కారమౌతాయనే శాస్త్రీయ సత్యం గ్రహించిన రచయితలు పంజాబ్, ఉత్తరప్రదేశ్ (జనకళా మంచ్). మహారాష్ట్ర (దళితపాంథర్లు), ఆంధ్రప్రదేశ్‌లలో విరసం వంటి సాహిత్య సాంస్కృతిక సంస్థలను స్థాపించడానికైనా, అనివార్యమైన కారణాలు సమాజంలో, చరిత్రలో, వర్గసంబంధాల్లో వున్నాయనే సత్యాన్ని మభ్యపుచ్చడానికి యీ ప్రభుత్వం విప్లవకారులు. రచయితలు కుట్రచేస్తున్నారని ఉల్టాకేసు బనాయించింది.

చరిత్రలో ప్రజలకు వ్యతిరేకంగా కుట్ర శతాబ్దాలుగా జరుగుతున్నది. ఈ కుట్రకు వ్యతిరేకంగా పోరాటాలుకూడా విజయవంతంగా తరతరాలుగా సాగుతూనే వున్నాయి. ఈ దోపిడీవర్గాల కుట్రను శాస్త్రీయంగా విడమరచిచెప్పి బద్దలుకొట్టిన ఆయుధం మార్క్సిజం-లెనినిజం. అదే యీనాటి మావో ఆలోచనా విధానం. ఆలోచనను కుట్రగా ఆరోపించే ప్రభుత్వం- అలలపై నిఘావేసి బంధించి, అలలను ఉరితీయాలని కలలుగనే సముద్రపు దొంగకన్నా హీనమయింది. విప్లవాలను అణచేసే అంచెలవారీ కార్యక్రమంలో విప్లవకారులను నిర్బంధించి, కాల్చివేసి, విప్లవ రచయితల భావస్వాతంత్ర్యాన్ని కాలరాచివేసి, విప్లవంపట్ల సానుభూతివున్న ప్రజలందరిమీదా తన పంజావిసరడం యీ దోపిడీవర్గం పథకం. అందుకని ప్రజల ప్రాథమికమైన హక్కులు నేలరాయబడుతుంటే మౌనం వహించేవాడు, దోడిడీలో పాలుపంచుకునేవాడయితే తప్ప తప్పించుకోలేడు. ఈ సత్యాన్ని ప్రజాస్వామ్యవాదులందరూ క్రమంగా అర్థంచేసుకుంటున్నారు.

ప్రజలు మాత్రం తమ ప్రాణప్రదమయిన హక్కుల్ని తమ ప్రాణాలొడ్డయినా సాధించుకుంటారు.

ప్రజాస్వామ్యశక్తులన్నీ ఐక్యమై తమ హక్కుల్ని కాపాడుకునే పోరాటాలు, పోరాటంచేసే హక్కు నిలబెట్టుకోవాల్సిన పరీక్షాసమయం ఆసన్నమయింది. ఈపరీక్షను సంఘటితంగా ఎదుర్కోకపోతే ప్రజలపట్ల సానుభూతికూడ నేరమైపోయే దుర్దశలోపడతాం అందుకే ప్రజాస్వామ్య విలువలపట్ల నిజమైన గౌరవంగల శక్తులన్నీ, అవి ఏ రంగంలోవున్నప్పైనాసరే, ఏకీకృతమై యీ ప్రభుత్వ నియంతృత్వవిధానాన్ని నేలమట్టం చేసే శక్తివంతమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

— సంపాదకులు

---

# కొత్తమనిషి

"కామ్రేడ్స్ రక్తంతో అరుణారుణమైనదాబే విప్లవపుబాట. మానవజాతి విమోచనంకొరకు ఏ మూల్యమూ చెల్లించకుండా ఎలా వుండగలం? మనమీద జరిగే ప్రతిదాడి విషాదకరమైనదే. ఈ విచారంనుండి యింకా ఎక్కువ గొప్ప త్యాగాలు చెయ్యడానికి కావలసిన స్థిరసంకల్పం, శత్రువుయెడ తీవ్రమైన ద్వేషం, పగ, ఉద్భవిస్తాయి. ఇవి మావో ఆలోచనావిధానంతో సంధానించబడినప్పుడు "కొత్తమనిషి" పుడ్తాడు- అణగారిన భారత ప్రజానీకం, కోట్లాది భూమిలేని పేదరైతులు అత్యంత ఆతురతతో ఎదురుచూస్తున్న కొత్తమనిషి ఇతడే భూమిలేని పేదరైతాంగం ఈ 'కొత్తమనిషి'ని ప్రసవించినప్పుడే యావద్భారత ప్రజానీకం తరతరాల తమ కన్నీటిని తుడుచుకొని నవ్వులు చిందించగలరు."

—చారు మజుందార్

> "రోజూ ముఖంచూసుకునే అద్దాన్ని తుడుచుకొన్నట్లు, నివసించే గదిని శుభ్రంగా ఊడ్చుకొన్నట్లు, మొహం శుభ్రంగా కడుక్కున్నట్లు రివిజనిజాన్ని తుడిచేయాలి, వూడ్చేయాలి, కడిగేయాలి. పోరాటం ద్వారా తప్ప రివిజనిజాన్ని తుదముట్టించలేం—"

## చారుమజుందార్ బతికున్నడు ఖబర్దార్ !

—సమ్మ

మస్తిష్కాల్ని దులిపి
మాసిన మనుషుల్ని కదిపి
చరిత్రలో కొత్త పుటల్ని తెరిచి
మేధావులకు కర్తవ్యాన్ని బోధించిన మనిషి–ఆయన–
ఆయనకు– విప్లవ జోహార్లు

ప్రభుత్వాన్ని ప్రకంపింపజేసి
పెట్టుబడిదారుల జాతకాల్ని బట్టబయలుచేసి
భూస్వాముల గుండెల్లో గుబులు పుట్టించి
ఉరేసుకుంటున్న ఊరెలుపలి మనుషులకు ఊపిరిపోసి
బడుగు జాతికి సారధ్యం వహించిన మనీషాయన !

స్వాతంత్ర్యం పేర జరుగూతూన్న దగాల్ని, కుట్రల్ని విప్పిచెప్పి
ఉన్నోళ్ళ వంచనల్ని, కుయుక్తుల్ని బైటపెట్టి
శ్మశానంలాటి నిశ్శబ్దపు చీకటిలో జరిగే అన్యాయాలపై
హఠాత్తుగా విసరబడ్డ 'హేండ్ గ్రెనేడ్' ఆయన ;
తుపాక్కెదురుగ్గా పేల్చబడ్డ మొట్టమొదటి
'తుపాకీ గుండా'యన– ఆయనకు విప్లవాంజలులు.

కర్మసిద్ధాంతాల ముసుగేసి
బానిసత్వాన్ని పూసి
బండ చాకిరీల బాటలేసి
వర్గాల దుర్గాల నిర్మించి
కరెన్సీ పరుపులపై పొర్లే
దొరల్ని– సుఖాల వారసుల్ని
నినాదాల దాన పెట్టి
ఓట్ల పాలు పిండుకుంటూ
పోలీసుల పహరాలో
పొట్ట గడుపుకుంటున్న

ప్రభుత్వాన్ని- నిరంకుశత్వాన్ని
ఉరిమి ఉడుకు పుట్టించిందాయన
కసిరి కంపరం పుట్టించిందాయన
ఆయన- ఆయన- చారుమజుందార్ !

పదునైన కత్తుల్లాంటి సిద్ధాంతాలపై నడిచి
పగలూ- రాత్రీ విశ్రాంతి మరిచి
శ్రామిక- కర్షక- కార్మికులకొరకు
నిరంతరం కృషిచేసిందాయన-
వర్గ చైతన్యానికి పదును పెట్టిందాయన
సాయుధ పోరాటానికి పునాది వేసిందాయన

పిరికి ప్రభుత్వం
కాంగ్రేసు గుండాలు
'సిద్దాంతం' ఎదురు నిల్వలేక
పేదల సుఖాన్ని ఓర్వలేక
ఆయన్ని బంధించి
కసిగా- చంపింది-
కానీ,
అదే నిమిషాన ఎన్నివేల చారులుదయించారు !
ప్రభుత్వం పిచ్చెక్కింత !!

హుం ! చారు శ్వాస మమ్మల్ని వదలదు
అదిగో ఆయన చూపిన బాట
రక్తం వెలుగులో మెరూస్తూంది
మనల్నందర్నీ ఆహ్వానిస్తోంది
పద పోదాం
చారు ఆశయాలకోసం పోరాడుదాం
ఆయన వారసులమనిపించుకుందాం
దళారీల కాళ్ళకింద నలుగుతూన్న
మన దేశాన్ని 'విముక్తి' చేద్దాం.

## అరుణ ప్రభాతం

—ఎం.టి. ఖాన్

ఏ ఎత్తైన చెరసాల గోడలు ద్వారాలుకూడ
త్యాగధనుల ఉన్నత సంకల్ప యవ్వనాన్ని అడ్డలేవు
కెరటాలు కెరటాలుగా పొంగుతూ
విప్లవం ఒక ఉప్పెనలా ముంచుకొస్తున్నది
దాని ప్రతి తరంగమూ చీకటిగుర్తులను తుడిచేస్తుంది-
కుళ్ళిపోయిన చీకటి నరాలలోంచి నెత్తురు కారుతున్నది
అదుగో అరుణ ప్రభాతం!

('73 అక్టోబర్‌లో జైల్లోరాసిన గీతం)

## పెన్ పిస్టల్

—యాత్రిక్

అడవిలో కొండలమాటున పొదలో నక్సలైట్ల ఆచూకీ
పోలీసులమీదికి ఆయుధాలుపేల్చి తప్పించుకున్నారు
తుపాకులు, ట్రాన్సిస్టర్, మావో సాహిత్యం దొరికింది

పోలీసులలో 'సంఘర్షణ'లో సత్యం మృతి
ఎం.ఎల్. గన్ను, జేబులో కొన్ని బులెట్లు;
'తుపాకి గొట్టంద్వారానే రాజ్యాధికారం సిద్ధిస్తుంది'
అనే మావోసూక్తి ఆయన గుండెలో దొరికింది.

అడవి నరుకుతున్నారనే అనుమానంపై
గొడ్డళ్ళతో చెట్లునరుకుతున్న రైతుల అరెస్ట్
పోడు చేసుకున్న పొలాలకు బాటవేస్తున్నామని
అడ్డమొచ్చే క్రూరమృగాలను
అడ్డంగా నరికేస్తున్నామని కోర్టులో ప్రకటన

మావో ఆలోచనా విధానం ప్రజలకందిస్తుండగా
రచయితల అరెస్ట్
కవుల దగ్గర విప్లవ భావాలు
ప్రజలదగ్గర విప్లవ చైతన్యం వున్నట్లు అనుమానం

చైనానుంచి ముప్పైవేల పెన్‌పిస్టల్స్
దిగుమతి అయినట్లు వార్త
కర్నూలు విరసం మహాసభలో శ్రీశ్రీ
తన కలాన్నిచూపి యిదే తన ఆయుధమని
పబ్లిగ్గా ప్రకటించాడట.

విప్లవ రచయితలు 'హీరో'*లతో
కుట్ర చేస్తున్నారని పోలీసుల తుపాకులు కేసుపెట్టాయి.
సూర్యోదయం కుట్రగా నిరూపించడానికి
చీకట్లో సాక్షులను గాలిస్తున్నాయి

ముసలి మూర్ఖులు కొండలను తవ్వుతున్నారు
'ఏడేళ్ళయింది, ఎన్నిముక్కలయ్యాయి మీరెక్కలు !'
అంటున్నారు తెలివిమీరినవాళ్ళు.

ఏడేళ్ళేకాదు, యీతరం కండరాలు కరిగిపోసి
యీ కొండల్ని కూల్చడానికి

నీటి పునాదుల్లో విప్లవకారుల నెత్తుటి కసి
బర్మార్లు దట్టిస్తున్నది–
మృతవీరుల ఆశయాలస్మృతి వజ్రాయుధమై
యీ కొండల గర్వాన్ని ఖండిస్తున్నది

మేం యీ పగుళ్ళుచూపిన దోపిడీ కొండల
పెల్లల్ని పెకిలించి చూపుతున్నాం
గుండెల్ని గునపాలుచేసి ముసలి మూర్ఖులు
యీ కొండల్ని తవ్వుతున్నారు

ఆశయానికి, ఫలితానికి మధ్యన పేరుకున్న చీకట్లను
రక్తకిరణాలతో, భవిష్యత్తులోకి పరుచుకున్న
చూపులతో చీలుస్తున్నారు—

వెలుగు తీరాలవెంబడి పరుచుకున్న పొలాలకూ
జాటకూ మధ్యన అడ్డంగా నిలిచిన యీ కొండల్ని
చెండువలె తన్నేసి
ప్రజాశక్తి
'ముసలి మూర్ఖుల ఎర్రజెండా' విజయాన్ని పాడుతుంది.

[* చైనాలో తయారయే పెన్ను.]

## విప్లవ మేఘం

గిరిజన్

మబ్బా మబ్బా! ఈ మాటచెప్పు!
నీలోని ఈనీరు ఏమూల కొచ్చేను?
నీదూది కదలికల కేగమ్య ముండేను?
మబ్బా మబ్బా! నువు బదులుచెప్పు

మబ్బా మబ్బా! ఈమాట వినిపో!
రైతు కంటికి వత్తులేసుకుని చూసేను
కూలి వంటికి చెమట జలకమే మిగిలేను
కుమిలి కుమిలి నేల కొలిమెప్పుడారేను?

మబ్బా మబ్బా! చెవియొగ్గి వినుకో!
నా మాట వినినడువు తూర్పుకోస్తావైపు
కదలినీటినితాగి చదలంత పరచుకో
బూదిలా కమ్ముకుని భూమిపై కురియరా!

మేడపై పిడుగువై ఊడి రాలిపడాలి
గుడిసెపై జల్లువై కరుణ చిలికించాలి

ఖామందు భూఖైదు దారులను చరవాలి
గోచిపాతలవారి కాచి రక్షించాలి

తుప్పొదిలిన పటాకత్తి తళతళలలో
కరుకు గోసిన కోత కొడవళ్ళు ఝళిపించి
క్రూర రాక్షసరాత్రి కంఠ రక్తములోన
కాలమే పులు[illegible]డిగినట్టి ముత్తెమవాలి!

ప్రళయమౌ వర్షాన వృక్షాలు కూలగా
పచ్చికలు తలలెత్తి నృత్యాలు చెయ్యాలి!
మిట్టపల్లాలొకే సమతలమయేలాగ
కష్టకాలం గడిచి బతుకు ననలెత్తాలి!

మబ్బా మబ్బా! చేతిలో చెయివెయ్.
మబ్బా మబ్బా! నేను కోరిందిచెయ్
విధ్వసనం వినిర్మాణానికి పునాది!
విప్లవ మహావృష్టి పిదప నవ్యసృష్టి!!

"— ఏ ఒక్కరి ఆనందం కోసమో వేళ్ళుతెగే
వీణానాదం కాదు
మన పేగులమీద ప్రపంచ ప్రజల
విప్లవ ఆకాంక్షలు మీటుదాం— "

* * * *

"కాగితమూ కలమూ లాక్కుంటేనేం?
నేను నా చేతి వేళ్ళను గుండెనెత్తురులో ముంచుకున్నాను"

# బాధ్యత

రారాసి

పాదాల నిండా మంటలు పూసుకున్నావు
గుండె నిండా జనవేదన నించుకున్నావు
ఎడతెగని బంధంతో
ప్రపంచంనిండా పరుచుకున్నావు
నీ ఊపిరిలో సృజన
తుపాకీ సంగీతంవిని
క్రూరహింసపై జైత్రియాత్ర సాగిస్తోంది
దేశాల హద్దులు
నీ రక్తాల్లో చెరగుతున్నాయి
అడవులు జండాలై
నగరాల చుట్టుతున్నాయి
కొండలు కవచాలై
రక్షణను పరిరక్షిస్తున్నాయి
ఎన్నో యుగాలకీనాడు
పుడమి పులకిత మనస్సుతో
సూర్యకాంతికై
రక్తానుభూతుల కలలు తురుముకుంటోంది
చాకిరీ చితుల్లో కాలాన్నీ
బాధల బొక్కసాల్లో కాయాన్నీ
చివరిసారిగా శ్వాసిస్తున్న నేను
నా బాధ్యత నిర్వర్తించకుండా
అసంతృప్తంగా చేరుకోలేను సమాధుల్ని
అందుకే అందిస్తున్నా... నా బిడ్డల్ని.

# ఓ నా మేకా !

చెరబండరాజు

కసాయివాడి కనుసన్నల్లో
తిరుగుతున్న మేకా
నువ్వు తింటున్న ఆకులూ
తాగే నీరూ
ప్రకృతినుంచి నేరుగా అందుతున్న
సహజసంపద కాదుసుమా
తిండీ పనీ గుడ్డా నీడా
చివరికి గడ్డిపరకగూడా
ఈ దేశంలో మేకల
జన్మహక్కు కానేలేదు జొనుగదా

వాటికి కసాయివాడు హక్కుదారుడు
వాడి హక్కును రక్షించే
ఉక్కు రాజ్యాంగం వాడి భుక్తమై
వుంది

నీ పంచప్రాణాలు అదిగో అక్కడ
వాడి కొనగోటిమీద ఉన్నాయని
గుర్తుంచుకో

కసాయిశాల ప్రాంగణంలో
నువ్వెన్ని నాట్యాలుచేసినా
కళానైపుణ్యాలు ప్రదర్శించినా
వాడిచ్చే బహుమానాల వాగ్దానాల
వెనక

నిన్ను పులిమి బుక్కపెట్టే
వాడి కోరలు నీ నీడనునైతం
కొరుక్కు తినక మానవని
కలలోనైనా మరిచిపోకు

నీ శ్వాసమీద వాడి అధికారంముద్దర్లు
నీ నాల్కమీద వాడి పన్నుల కత్తెర్లు
నీ కళ్లకాంతిమీద వాడి శాసనాల
పెగలు

నీ ప్రతికదలికలో వాడు పాతేసిన
బ్రహ్మజెముళ్ళు

కసాయివాణ్ని నమ్మిన ఏమేకా
ఏ దేశంలోనూ బతికి బట్టకట్టలేదు
పూలమాలల్తో ఊళ్లో
ఊరేగుతున్నానని మురిసిపోకు

మేకను బలియిచ్చేముందు
కడివెడు మంచినీళ్లుతాపే చంపుతారు

అది జీవకారుణ్యమో
దయో ధర్మమో పవిత్రితో
ఏదో తెలుసుకో

ఓ నా మేకా
నువ్వు ఎన్జీవో వో
విద్యార్థివో
రైతువో
కార్మికుడివో
బడిపంతులివో

మేకా నీకా కసాయివాడితో
దోస్తీయో కుస్తీయో త్వరగా
తేల్చుకో.

31-1-1974.

## ఫూకియాన్ దిశగా పురోగమనం*

మావో-ఝూ-డ్యోంగ్

అకస్మాత్తుగా ఆకాశాన్ని
గాలీ మబ్బులు చించాయి
యుద్ధపరిభువులు ఢీకొన్నారు
తిరిగి యుద్ధం.

తలకింద యువగింజల తలగడ
పసిడిరేణుల దిండుగ మారిన
బంగరు కలలు కను కర్షకునిమీద
కురుస్తూంది ద్వేషం వర్షమై.

మన దారికెదురుగ
కలతలేని టాంగ్‌నదిపైనా,
షాంగ్‌హాంగ్‌వరకు, రాక్షసిపర్వతం
లుంగ్ యెన్ పర్యంతం
మన అరుణపతాకాలు
ఇంకా గంతులువేస్తున్నాయి.
బంగారు పాత్ర చైనా
తునాతునకలైంది.
ముక్కచెక్కల్ని అతుకుతున్నాం
ఆనందంతో పచ్చని పొలాల్ని
పంచుతున్నాం.

(1934)

[జనచైనాలో కామ్రేడ్ మావోను మావో-ఝూ-డ్యోంగ్ అని పిలుస్తారు]

---

* ఈ కవితలో మావో (మావో-ఝూ-డ్యోంగ్) చైనా విప్లవ పోరాట గమనం చిత్రిస్తున్నాడు. 1927 లో మావో చూతే (ఝోడో) కలిసి చైనా ఎర్రసైన్యానికి నాయకత్వంవహించి చ్యాం-గై-షెకు (ఝ్యాంగ్-జ్యో-ష్యో) ప్రభుత్వంపై తిరగబడి "హూనాన్", "కియాంగ్సీ" సరిహద్దు ప్రాంతాల్లో కమ్యూనిస్టు రాష్ట్రాన్ని స్థాపించేరు. ఆ ప్రాంతంలో నిలదొక్కుకుని 1930 తదుపరి ఫూకియాన్, అన్‌హూయ్, హూనాన్, షెన్సీ, కాన్సూ, క్వాంటుంగ్, హైనాన్ రాష్ట్రాల్ని విముక్తిచేశారు. ఆ విముక్తి సంగ్రామంలో ఫూకియాన్ రాష్ట్రంపై దాడి వెడలుతూ సాగిపోతూన్నప్పుడు మావో ఈ కవిత (1934లో) రాశాడు. —అనువాదకులు.

ఆంగ్లంనుండి తెలుగుసేత : పాబ్లో.

"నా ముందుతరాల వారికి మనసారా నవ్వే స్వాతంత్ర్యం
కోసం యీనాడు నేను తుపాకి చేతపట్టాను—"

## ఎర్ర జండా ఎగరేద్దాం

గన్‌మెన్

ఈ మధ్య మనకు
ఎన్నో రక్తధారలు తప్పవు
అడుగడుగున
రక్తం మూల్యంగా
చెల్లించక తప్పదు

రక్తతర్పణం చేసినమార్గాన్నే నడిచి
ఎర్రకోట చరిత్ర మారుద్దాం
అరుణారుణంగానే వెలుగుదాం.

మార్గమాసాంతము
మన రక్తంతోనే
చరిత్రను రాసుకుంటూ పోదాం.

నా దేశ విముక్తి
సైనికులారా!
రైతు
కూలి
కార్మికుడా!
ఐక్యం కండి
కదలండి
కార్మికరాజ్యానికై కాలుదువ్వండి.

కూలినుండి
కిల్లి కొట్టువాడి వరకు
అందరం కలిసి
ఢిల్లీ కోటదాకా గుండెలపై
ఎర్రజండా మోసి యెగరేద్దాం.

## గెరిల్లా

బి. సూర్యనారాయణరెడ్డి

ఇదే స్థలంలో
ఇదే పొద దగ్గర్లో
పట్టపగలు
ప్రాణాల దోపిడీ జరిగింది
న్యాయం పోరాటాన్ని సమాధిచేయ
డానికి
వ్యర్థప్రయత్నం జరుపబడింది
ప్రిదిలిన అతని రుధిరం
పచ్చని ఆకులపై
ఎర్రనేల సాళ్ళల్లో

పొడుచుకొస్తున్న సూర్యునిలా
తరంగలించింది

అతడు
త్యాగానికి తిలకం దిద్దినవాడు
దుఃఖాల పరిష్కృతికి
అన్యాయాల నిష్కృతికి
కదనాన్ని కదలుచ్చుతున్న వీరుడు
శత్రు ప్రాంగణంలో
చావుతప్పెటలు చప్పుడుచేస్తున్న
వైతాళికుడు

పీడిత ప్రజల సంక్షేమం కోసం
నడుస్తున్న మహాప్రస్థానంలో
తన కంకాళాన్ని వంతెనగా
పరుస్తున్నవాడు
భావితరాల భాగ్యం కోసం
బాధాజీవుల స్వర్గం కోసం
కూడు విడిచి, గూడు విడిచి
పరిశ్రమిస్తున్న పరివ్రాజకుడు
ప్రజ్వలిస్తున్న భానుశేఖరుడు

అతని త్యాగం వృధాపోదు
అది ధ్యేయం చేరక మానదు
ప్రిదిలి రుధిరంలోంచి
మిలియన్లు మిలియన్లు మిలియన్లు
ముందుకొస్తారు
మహాప్రస్థానం
వడగండ్లు, వడగండ్లు, వడగండ్లు
కురిపిస్తారు.

## చెప్పరా సిన్నోడా!

'రుద్రజ్వాల'

చెప్పరా సిన్నోడా
గొంతిప్పి సెప్పరా
అమరవీరు లెలిగించిన
ఈ నెత్తురు కాగడా
అందుకున్నామనీ
ఆరిపోనివ్వమనీ ॥చెప్పరా॥

గద్దెక్కిన పశువులకూ
మిద్దెల్లో దొంగలకూ
గుండెల గునపాలుగుచ్చి—
తూర్పుగాలితెరల్లో
తొలివేకువ తెస్తామని ॥చెప్పరా॥

కట్టానికి కన్నీళ్లను
కొలిసిచ్చే దొరతనాన్ని
కూల్చు ఎర్రనేనెత్తిన
ఎర్రెర్రని జెండకింద
నీవు, నేను, రైతు, కూలి

నిరుద్యోగి, చిరుద్యోగి
కార్మికులం నిలిశామని
కలిసి పోరుతున్నామని ॥చెప్పరా॥

ఎన్నినాళ్ళు నువు సదివిన
ఎండిపోవు జీవితం
చెల్లని పట్టాకిందే
చితికే నీ జీవనం
చారుసూర్యకిరణంలో—
గర్జించిన వసంతంలా
నడచిన క్రొంగొత్త మనిషి
అడుగేసిన జాడల్లో—
నీ-నా-మన-జనతాశల
సమతారుణ ఆశయాలు
వికసించే దారుల్లో—
తుపాకీని ఎత్తిందని
ఎత్తిందిక దించమనీ ॥చెప్పరా॥

## ఈ స్వాతంత్ర్యం మనదికాదు

నిజం

ఇది దేశమాత వక్షస్థలంపై పుట్టిన ఇవవై ఏడవ రాచపుండు
జనం గుండెల్లో దూసుకున్న
మరో దోపిడీ తుపాకి గుండు
ప్రజల రక్తమాంసాలను
నిర్విరామంగా త్రాగి త్రేన్చేందుకు
స్వదేశీ బ్రాండు నరరూప రాక్షసులకు
విదేశీ బ్రాండు దోపిడీ కిరాతకులిచ్చిన పర్మిటుట

రెక్కలు ముక్కలుచేసి
ముప్పొద్దులా కష్టించి
మురికివాడల మూల మూలల్లో
మూలుగుతున్న శ్రమజీవన శల్యాలు
ఉత్పత్తికీ ఉపాధికీ వెన్నెముకలు
అన్నమో రామచంద్రా అని అంగలారుస్తూ
కుక్కచావులు చస్తోన్న శత సహస్ర
నరనారీ భారత పౌరులు
సస్యశ్యామల ధాత్రీ సుపుత్రులు
ఫుట్‌పాత్‌లపై దొర్లుతోన్న
దరిద్ర దేవత సంతానాలు
అధిక ధరలు : అధో జగత్ సహోదరులు
బ్లాకు మార్కెట్టు బలిపీఠాలపై
తలలు వంచుతోన్న మధ్యతరగతి, కూలినాలి కొనవూపిరి జీవాలు
నిరుద్యోగ పెనురక్కసి కౌగిట్లో
ప్రాణాలు విడుస్తోన్న చైతన్య దీప్తులు
పడుపుకూటితో సగం కడుపు నింపుకుంటోన్న
పవిత్ర భారత నారీమణులు
దోపిడీ సంస్కృతి విషపుకోరల నడుమ
హాహాకారాలు చేస్తోన్న కోట్లాది అమాయక జనులు

శోషలిజం బూతు భాగోతాల మాటున
షోకు చేసుకుంటోన్న నల్లధనం నర్తనశాలలు
ఇవన్నీ
తన ఇరవై ఏడేళ్ళనాడు
ఈ స్వాతంత్ర్యం చుప్పనాతి
మన కషాయంగా యిస్తున్న మహత్తర కాన్కలు

ఆపిల్‌కీ శాలువాకీ
ఆలిండిరా రేడియోలో అయిదు నిముషాలపాటు
స్వరవిన్యాస ప్రదర్శనానికీ, స్వకుచమర్దనానికీ
అమాత్య శేఖరుల అరికాలి పరాగానికీ
అయిదు పదుల బక్షీస్ అమేధ్యానికీ
మురిసిపోయి
సంప్రదాయ కవి కులతిలకుని డ్రెస్సు సింగారించి
వోహో నా స్వాతంత్ర్యమా! ఆహా నా స్వాతంత్ర్యమా
అందచందాల భూతలస్వర్గమా
గాంధీగారి బోసినోట్లోంచి ఊడిపడి
నెహ్రూగారి చెప్పుచేతల్లో
మప్పితంగా పెరిగి పెద్దై
ఇందిరాగాంధీగారి కనుసన్నలలో
విలసిల్లుతోన్న సుందర సువిశాల
సోషలిస్టు మందిరమా! అనేక కిరాయి గార్దభాల
వందిమాగధ శ్లోకాల బాకాలతో
సింగారించుకు వచ్చిన ఈ స్వాతంత్ర్యం మనదికాదు!
మనకింకా స్వాతంత్ర్యం రానేలేదు!

భూస్వామ్య, ధనస్వామ్య బందిపోట్ల
దోపిడీ కుతంత్రాలను
శ్రామిక చైతన్య కుఠారంతో చీల్చాలనీ
స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనూ, సుఖ సంతోషాలనూ

నీకూ నాకూ అందరికీ సరిసమానంగా
పంచిపెట్టాలనీ
ఆస్తినీ అంతస్థునూ, భూమినీ భుక్తినీ
శ్రమైక జీవన సమాజ హస్తం చెయ్యాలనీ
భువన భవన ప్రాంగణాన
అరుణారుణ జనతా పతాక నెగురవేసి
సమతా సుందర నందనవన విరిసౌరభాల్ని
నేల నాల్గుచెరగులా వెదజల్లాలనీ
విప్లవ శంఖం పూరించిన
చారుసుందర మహోన్నత మానవతా సత్యశూరులను
పొట్టన బెట్టుకొన్న నరరూప రాక్షసులకు
వంగి వంగి సలాములు కొడుతూ
వారి బూట్లు నాకుతోన్న
ఈ స్వాతంత్ర్యం మనదికాదు
మనకింకా స్వాతంత్ర్యం రానేలేదు

ఇది మువ్వన్నె జెండాకాదు
మేకవన్నె మెకం
జన రక్త మత్తుపాన ఘీంకారాలతో
పిచ్చెక్కి నర్తిస్తోన్న 'శాంత్యహింసల' క్రూరమృగం
దీనికింద మనకు దొరికేవి
చంద్రనిప్పులే తప్ప చలువ పందిళ్ళు కావు

ఇది జనతా స్వాతంత్ర్య జెండాకాదు
జనాన్ని బానిసల్ని చేసే రండ
దేశ ప్రజల శ్రేయో సౌభాగ్యాలను
విదేశీ బందిపోట్లకు దోచిపెడుతోన్న
గణాచారి తార్పుడుముండ

దీని రెపరెపల్లో మనకు దొరికేవి
వెట్టిచాకిరీ నరకయాతనలే తప్ప
సుఖ సంతోషాల సుమగంధాలు కావు
దీన్ని దీని దోపిడీ రంకుమొగుళ్ళనూ
నేలమట్టం చేసి,
ఆ సమాధులపై
సమ(శ్రమ) సమాజ నిర్మాణం చేద్దాం రండి
సాయుధ శ్రామిక సోదరుల
పదాలంటి పయనద్దాం పదండి!

కథలు :

## మే ధా వి

చైనీస్ మూలం : లుసన్
అనువాదం : చలసాని ప్రసాదరావు

ఓ బానిస కష్టాలతో కాపురం చేస్తున్నాడు. అయినా వాటిని వదిలించుకునేందుకు అతగాడు చేసేదేమీలేదు.

కానీ, తన బాధలన్నీవిని సానుభూతిచూపే తీరికా, ఓపికాగలవారెవరేనా దొరుకుతారేమోనని మాత్రం చూస్తుండేవాడు.

ఓ సుప్రభాతాన అతగాడికో "పెద్దమనిషి" ఎదురయ్యేడు. ఆయనగారు చాలా తెలివైనవాడనీ, మేధావి అనీ అందరూ అంటూంటారు.

బానిస తన దీనస్థితినంతా అతనితో మొరపెట్టుకున్నాడు. "చూడండయ్యగారూ! నాదో కుక్క బ్రతుకనుకోండి. రోజుకోపూట తిండికూడా గతిలేదునాకు. పందులు కూడా ముట్టనిదేదో ఇంత నామొహాన్న కొడుతుంటాడు మా యజమాని. అదిమాత్రం ఎంతుంటుందనుకున్నారూ?" అంటూ దోసిలివిప్పి చూపించేడు.

మేధావిగారు చాలా బాధపడిపోయేరు బానిస వాలకంచూసి. "నిజంగానా? ఐతే, అది చాలా అన్యాయం అన్నమాటే!" అంటూనే ఆయన యజమానుల దాక్షిణ్య రాహి

త్యానికి ఆగ్రహపడిపోయేరు. ఆయన మొహం ఎర్రబడింది. కనుబొమలు ముడి పడ్డాయి.

దాంతో బానిసకు ఉత్సాహంవచ్చింది. "కాదుటండీ! రాత్రింబవళ్లూ గొడ్డుకన్నా మిన్నగా చాకిరిచేస్తుంటాన్నేను. కోడికూతకన్నా చాలా ముందేలేచి నీళ్ళతోడి మోసుకొస్తుంటాను. ధాన్యం దంచుతాను, పిండి రుబ్బుతాను, కట్టెలుకొడతాను, అయ్యగారికి విందు భోజనాలు తయారుచేస్తుంటాను, బట్టలుతుకుతాను, వేసవిలో రెక్కలూడేలా పంకా విసురుతుంటాను, చలికాలంలో నెగడు ఆరిపోకుండా అక్కడే కాపలాఉంటాను; వర్షాకాలంలో అయ్యగారికి గొడుగుపట్టేదికూడా నేనే. అయ్యగారు జూదంలోకూర్చుంటే అర్థరాత్రిళ్ళు కూడా టిఫిన్లు తయారుచేసి కనిపెట్టుకునుంటాను. కానీ... కానీ... ఇంతచేసినా నన్నెవరూ పట్టించుకున్న పాపానపోవటంలేదు. ఏనాడూ ఎర్రని ఏగానీ కూడా ఎవరూ నా ఎదానవేసిన జాడలేదు ఎప్పుడేనా దయదలిస్తే పీక్కుతినలేక వదిలేసిన ఓ బొమికెముక్క మాత్రం......"

"ఆగాగు..." ఇంక వినలేకపోయేడు మేధావి. బానిస కన్నీళ్లుచూసి అతని గుండెలు తరుక్కుపోయేయి.

"ఘోరం...!" మేధావిగారు బాధగామూల్గేరు. ఏదో అనబోయి గొంతు పెగలక గాబోలు ఆగిపోయేరు. ఓ దీర్ఘ నిశ్వాసం సుదీర్ఘంగా విడిచేరు. అతనికళ్ళు క్రమంగా ఎర్రబడసాగేయి. ఏడుపు ముంచుకురాబోతున్నదా అన్నట్లుగా కనుకొలకుల్లో నీళ్లు నిలిచేయి.

"ఇలా ఇంకా ఎంతకాలం బ్రతకగలనుసార్? ఏదో ఓ దారిచూడక తప్పదు. కానీ, నేనేంచేయగలను చెప్పండి! నన్నేంచేయమంటారూ?"

మేధావిగారు మరోసారి గాఢంగా నిశ్వసించేరు. "పరిస్థితులు తప్పక బాగవుతాయి. నాకా నమ్మకంఉంది" అన్నారు.

బానిస సంబరపడిపోయేడు. "నిజంగానాసార్! నిజంగా మీరలా అనుకుంటున్నారా? నాకూకూడా అలాగే అనిపిస్తూంటుందండీ! అయితే మీరూ నాలాగే ఆలోచిస్తున్నారన్నమాట. మీ సానుభూతివల్ల నాకు ఉత్సాహం కలుగుతోందండీ! మీ మాటలు విన్నాక ఈ ప్రపంచంలో న్యాయం, ధర్మం ఇంకా పూర్తిగా నశించిపోలేదనిపిస్తున్నదండీ!" అన్నాడు పొంగిపోతూ.

మేధావిగారు భవిష్యత్తునుగురించి ఆలోచిస్తూ ముందుకు సాగిపోయేరు.

రోజులు గడిచేయి. బానిస బ్రతుకు మరింత అధ్వాన్నంగా తయారయింది. యధా ప్రకారం సానుభూతి చూపగలవారికోసం ఎదురుచూసేడు.

అయితే, ఈసారి అతనికి తటస్థపడ్డవాడు 'పెద్దమనిషి'లా లేడు. పైగా చాలా మంది అతన్ని 'అజ్ఞాని' అని పిలుస్తుంటారుకూడా.

బానిస కన్నీళ్ళతో తన కష్టాలు ఆ అజ్ఞానివద్ద వెళ్ళబోసుకున్నాడు. "నాబాధలు చెపితే అర్థంఅయేవికావుసార్! పందులకన్నా హీనంగాఉంది నా బ్రతుకు. మా యజమాని దృష్టిలో నేనసలు మనిషినేకాను నాకన్నా తన పెంపుడుకుక్కను వెయ్యిరెట్లు ఎక్కువ ప్రేమగా చూస్తుంటాడాయన" అన్నాడు గద్గద స్వరంతో.

"అయితే, వాడినే నిలేసి అడుగు" అరుస్తున్నట్లుగా, తీవ్రంగాఅన్నాడు అజ్ఞాని. ఆ దూకుడుకు అదిరిపోయేడు బానిస. అజ్ఞానికి తను చెప్పింది సరిగా బోధపడలేదేమోనని యధాప్రకారం వివరించబోయేడు.

"ఎంతఘోరం అనుకున్నారుసార్! నేనో నేలబారు చుట్టుగుడిసెలో ఎండకెండుతూ, వానకు నానుతూ బ్రిదుకు వెళ్ళదీస్తున్నాను. కంటినిండా నిద్రపోదామన్నా వీల్లేకుండా పక్కనిండా నల్లులూ, గుడిసెనిండా దోమలూ. అవి నన్ను పీక్కుతింటాయనుకోండి! అసలా గుడిసే ఓ చీకటిగుహలా ఉంటుంది. దానికి కిటికీఅయినా లేదు. ఊపిరాడక చస్తుంటాననుకోండి...!"

అజ్ఞాని అన్నీ విన్నాడు. అయితే అతని కనుకొలకుల్లో నీళ్ళజాడలు ఏమాలా కనుపించలేదు. పైగా దృఢస్వరంతో అన్నాడు "ఓ కిటికీ పెట్టించమని నీ యజమానిని అడక్కపోయావా?..."

"నె...నె...న్నేనా...?" బానిస హడలిపోయేడు. అయ్యగారికి ఎదురుపడి నేనెలా అడగ్గలనుసార్?"

అజ్ఞాని తలాడించలేదు. "సరే! పద. ఆ గుడిసె ఎలాఉంటుందో చూద్దాం" అని కదిలేడు

బానిసవెంట అతని గుడిసెదాకావెళ్ళి లోపలా, బయటా అంతా పరిశీలించేడు అజ్ఞాని. మారు మాట్లాడకుండా ఓ పలుగు తీసుకుని గుడిసె మట్టిగోడకు కన్నం త్రవ్వసాగేడు.

"అయ్యో! అదేమిటిసార్!" బిత్తరపోతూ అడిగేడు బానిస.

"నీకు గాలీ, వెలుతురూ రావటంకోసం నీ గుడిసెకు కిటికీ పెడుతున్నాను" అన్నాడు అజ్ఞాని.

బానిస బెదిరిపోయేడు "బాబోయ్! అంతపనే...! మా యజమానిని అడగకుండానే...? ఆపండిసార్! ఆపండి! మా యజమాని తిట్టగలడు!"

"తిట్టనీ...!" అంటూనే తనపనిని కొనసాగించేడు అజ్ఞాని.

హడిలిపోయేడు బానిస. "దొంగ. దొంగ....." అని గొంతుపగిలేలా కేకలు పెట్టేడు. "ఓ బందిపోటువచ్చి నా కొంపకూలుస్తున్నాడరోయ్! రండి...రండి... పట్టుకోండి..." అంటూ నేలనబడి మూర్ఛరోగిలా కాళ్ళూ చేతులూ బాదుకుంటూ దొర్లసాగేడు

ఆ కేకలకు దూరాన్న పనిచేసుకుంటూన్న తోటి బానిసలు పరిగెత్తుకొచ్చి అజ్ఞానిని తరిమేసేరు. అంతా అయ్యాక తీరిగ్గా యజమాని వేంచేసేడు "ఏంటార్? గాడిద కొడకల్లారా!" అంటూ.

బానిస యజమానిముందు మోకరిల్లేడు. "ప్రభో! ఓ బందిపోటుగాడువచ్చి మన ఇల్లు పడగొట్టాలని చూసేడు. నేను వెంటనే కేకలేసి మనోళ్ళందర్నీ పోగుజేసి వాణ్ణి తన్ని తరిమేసేను"అని సవినయంగానూ, సగర్వంగానూ మనవిచేసుకున్నాడు.

"మంచిపనిచేశావ్!"అని ఓ నవ్వు నవ్వి వెళ్ళిపోయాడు యజమాని.

ఈ గొడవవిని చాలామంది వచ్చి బానిసనూ అతని గుడిసెకుపడిన కన్నాన్నీ పరామర్శించేరు. ఆఖర్న మేధావిగారుకూడా వేంచేసేరు. అతన్నిచూస్తూనే బానిస పరుగునవెళ్ళి దణ్ణంపెట్టేడు.

"సార్! నేనివ్వాళో మంచిపనిచేసేను. అందుకు మా అయ్యగారు నన్ను గొప్పగా మెచ్చుకున్నారుకూడా. అయ్యగారికి నామీద దయకలిగినట్లుంది మీరు అన్నారుగదా! పరిస్థితులు తప్పక బాగుపడతాయనీ, మంచిరోజులొస్తాయనీనూ. ఆ మాటలిప్పుడు నిజం అవుతున్నట్లున్నాయండీ! ఎంతైనా మీరు చాలా ముందుచూపుగలవారుసుమండీ!" అన్నాడు బానిస సంతోషంతో పొంగిపోతూ, ఆశావదనంతో ఆకాశానికేసి చూస్తూ.

"అవునవును...!" అన్నాడు మేధావికూడా ఆకాశానికేసిచూస్తూ.

(Original title: THE WISE MAN THE FOOL AND THE SLAVE,
First Published in July 1925)

[ జూన్ 'సృజన'లో కథలు అనే శీర్షికకింద ప్రచురింపబడిన 'బుగతగాడి మాంసం' కథకాదు- వాస్తవంగా జరిగింది- చైనా అంతర్యుద్ధం ఆఖరిదశ (1948-49)లో చైనాలో విస్తృతంగా పర్యటించి 'China Shakes the World' అనే పుస్తకంరాసిన 'జాక్ బెల్డెన్'కు గుర్రబ్బండి తోలేవ్యక్తి చెప్పిన వాస్తవంగా జరిగిన ఉదంతం సం॥ ]

# సంఘర్షణ

గిరిసింహం

"కమాన్ మిష్టర్! మాకన్నీ తెలుసు. నీవేందాచీ లాభంలేదు. అనవసరంగా ఒళ్ళు పాడుచేసుకోకు. చెప్పేయ్- ఊఁ- ఆలస్యంపనికిరాదు". కళ్ళల్లో నిప్పుకణికలు ఎగజిమ్ముతూ గదంతా ప్రతిధ్వనించేలా హూంకరించాడు యస్.ఐ సీతారామయ్య

చిరిగిన ధోతీ, మాసిన చొక్కాలతో, ఎన్నాళ్ళో కూడూ నీళ్ళూ లేకుండా శుష్కించిన శరీరంతో చలిజ్వరంవచ్చిన రోగిలా వణుకుతున్నాడా యువకుడు. ఒళ్ళంతా పచ్చిపుండై పోయింది. ఎముకలు తీపులుపెడ్తున్నాయి. నరకమనేది ఉంటే గింటే అది ఇక్కడేనేమో అనే ఆలోచన తళుక్కుమంటూ ఉంది. సీతారామయ్య చేతిలోని లాఠీ యమదండలాగే ఉన్నది. దీనంగా మూల్గాడు. ఏదో చెప్పాలని పెదవులు విచ్చుకున్నాయి. తన ప్రయత్నం సఫలంకాకముందే మనస్సు అవమాన భారంతో కుంగి, విచ్చిన పెదవుల్ని తిరిగి మూసివేసింది.

"కమాన్! నాకు తిక్కరేపకు: పిచ్చిపిచ్చి వేషాలువేయక, నిజం చెప్పేయ్, మాకన్నీ తెలుసు. ఏందాచినా లాభంలేదు. కోపమొస్తే మనిషినిగానని తెల్సుగా. నీకు వచ్చిన భయమేమీలేదు; రాజాలాంటి ఉద్యోగమిప్పిస్తాను. చదువుకొన్నవాడివి హాయిగా ఉద్యోగంచేసుకుంటూ, పెండ్లి చేసుకొని కులాసాగా గడపకుండా ఈ వెర్రిమొర్రి వుద్యమాలు నీకెందుకయ్యా! కమాన్! నీవెంబడి ఎల్లాపురం మామిడితోపుల్లో మీటింగుకొచ్చిందెవరు?".

"నాకు తెలియదు" దీనంగా నూతిలోంచి వచ్చినట్లు వణుకుతూ ఉన్నదాగొంతు.

"యూ డర్టీ ఫెలో! బద్మాష్ లంజాకొడుకా! నీవిట్లా మంచిగా మాట్లాడితే చెప్తావురా! యూహార్డెన్డ్ క్రిమినల్!"

టప టపమంటూ వడగళ్ళ జల్లులాపడ్తున్నాయి లాఠీదెబ్బలు. అబ్బా!...ఎముకలు విరిగిపోతున్నాయి. ప్రాణాలు ఎగిరిపోతున్నట్లయి అనంతమైన పీడన, మెల్లగా కళ్ళు మూతలుపడసాగాయి. ప్రపంచమంతా గిరగిర తిరుగుతున్నట్లనిపిస్తూంది రాజుకు, బలంగాపడింది సరిగ్గా ముఖమ్మీదనే ఒక లాఠీదెబ్బ. ఉడుకురక్తం వేగంగా చిమ్మింది, విరిగిన పంటినుండి, అబ్బాఅనే కేకతో స్పృహతప్పి పడిపోయాడు.

తిరిగి కళ్లు తెరిచేసరికి ఎదురుగా నెరసినగడ్డం, ముడుతలుపడ్డ మోముతో మొహంపై నీళ్ళుచల్లుతూ కనిపిస్తున్నాడు రైటరు అప్పయ్య. సావిట్లో ఉక్కమకట్టేసి

నట్లు స్తంభానికి సంకెళ్ళతో బంధించి పడుకోబెట్టారు తనను. ఏదో మాట్లాడుదామని నోరు తెరిచాడు. ఐతే అసహ్యమైన వేదన- ఒక్కసారిగా నరాలన్నీ గుంజుకుపోయాయి- దీనంగా మూల్గడంతప్ప ఇంకేమీ చేయలేకపోయాడు. భీతావహమైన చూపులతో అటూ ఇటూ చూడసాగాడు.

లేని సానుభూతిని తెచ్చిపెట్టుకుంటూ అప్పయ్య ఉపన్యాసం దంచేస్తున్నాడు. వచ్చీరాని ఇంగ్లీషు అక్కడక్కడా కలుపుతూ.

"మిష్టర్ రాజూ! యూ ఎడ్యుకేట్ మాన్! వైడు లైక్ దట్. నీకేం తక్కువయిందని ఇటువంటి ఉద్యమాల్లో దిగావయ్యా? అయినా వీటివల్ల ప్రజలకేంలాభం చెప్పు. ఎక్కడో నలుగురు దళంఅని జమకూడితిరి. ఎవడ్నో ఒకడ్ని పుటుక్కుమనిపిస్తిరి. మీరొక్క భూస్వామిని చంపితే ప్రభుత్వం వూరొక్కంటుందా? ఊళ్ళోని జనాన్నంతా వీపులుపగల బాదిస్తుందాయె. ఆ దెబ్బలకాసక వాళ్ళు మళ్ళా మీరుపోతే మిమ్మల్నే పట్టించేందుకు సిద్ధంగా ఉన్నారు. ఏం కాదంటావా? మల్లారెడ్డిగూడెంలో మీ ఎల్లయ్య ఎట్లా పట్టుబడ్డాడు చెప్పు? అన్నీ పిచ్చిచేష్టలుకాకపోతే ఇవన్నీ ఏందయ్యా?

ఆఁ- కొట్లాడు; నేనొద్దనను. కొట్లాడకపోతే ఈ బలిసిన లంజకొడుకులు పెచ్చురేగిపోతారు. ఐతే దానికీ ఒక పద్ధతివున్నది. ఇప్పుడు మనది ప్రజాప్రభుత్వమాయె. మీటింగులుపెట్టు. వూరేగింపులుతీయి, సంఘాలుపెట్టు, పబ్లిగ్గా కొట్లాడాలోయ్! అదీ ధైర్యమంటే. ఈ చాటుమాటు వ్యవహారాలేందయ్యా. చూడు, మన పుల్లయ్యగారు వున్నారు. ఆయనమాత్రం కమ్యూనిస్టుకాడూ? మొన్న హుజూరాబాద్‌లో పెద్ద ఊరేగింపుకూడ తీసిండు. అటువంటివాళ్ళను మేమేమైనా అంటామా?

# II

ఐనా వృద్ధిలోకి రావల్సిన యువకుడివి నీకెందుకోయ్. ఈ తతంగాలు; చూడు అనవసరంగా బ్రతుకు పాడుచేసుకోకు. మా ఎస్.ఐ. మంచివాడుగాని లేకుంటే ఏనాడో నిన్ను టపీమన్పించేసును ఇప్పుడైనాగాని నిన్ను ఎల్లమ్మగుట్టకు తీసికెళ్ళి కాల్చేస్తే దిక్కెవరయ్యా? మీ వెంపటాపు సత్యం, కైలాసంలగూర్చే అడిగేవాడు లేకపోతే నీ సంగతెవరు పట్టించుకుంటారోయ్? అనవసరంగా ఆరోగ్యం పాడుచేసుకోకు. ఇప్పుడు నీకు తగిలినదెబ్బలు ఆవగింజంతకాదనుకో. మా ఎస్.ఐ. గార్కి తిక్కరేగిందంటే కట్టెపుల్లను విరిచినట్లు విరిచిపారేస్తాడు. వింటున్నావా?- దిగాలుపడి చూస్తావేమయ్యా? ఆకలిగాఉందా? కొద్దిగా టీ తాగుతావా? ఆఁ—ఏమైనా టిఫిన్‌తింటావా?"అని ఒరేయ్ రాజయ్యా! ప్లేట్‌పూరీ, ఒక టీ పంపించు"అంటూ కాన్‌స్టేబుల్ రాజయ్యను గదిమాడు.

బాధతో మెలికలు తిరుగుతూ కళ్ళుమూస్తూ తెరుస్తూ వినలేక వింటున్నాడు రాజు. ఇంతలో టిఫిన్, చాయ్‌తో హోటల్‌పిల్లవాడు హాజరయ్యాడు.

ఎంతో ప్రేమ ఉట్టిపడుతున్నట్లు మెల్లగా రాజునులేపి పూరీప్లేట్ అందించాడు రైటరు అప్పయ్య. చచ్చిన ఆకలి ఒక్కసార్కి లేచిరాగా అమాంతం ప్లేటునే మింగేసినంత పనిచేశాడు రాజు. తర్వాత వేడి టీ కడుపులోకి పోయినంక కొద్దిగా ప్రాణం వచ్చినట్లయింది. కాస్త సర్దుకుని గోడకానుకొని కూర్చున్నాడు.

అప్పయ్య సిగరెట్ వెలిగించాడు. ఇంకోసిగరెట్ రాజుకిచ్చి "హావ్ఇట్" అంటూ అగ్గిపుల్ల వెలిగించి అంటిపెట్టాడు. మౌనంగా సిగరెట్ కాలుస్తున్నాడు రాజు.

"పోనీ నాకు చెప్పవయ్యా. దేవునిమీద ఒట్టు. నేనెవ్వరికీచెప్పను. ఊరికే తెల్సుకోవాలని అడుగుతున్నాను. ఎల్లాపురం తోపుల్లో మీటింగుకొచ్చిందెవరు? అబ్బ! నీవు చెప్పకపోయినా పర్వాలేదు. ఊరికే ఏదో కుతూహలంకొద్దీ అడుగుతున్నానులే. ఐనా నాకుచెప్తే నష్టమేమయ్యా?" ఊరిస్తున్నాడు అప్పయ్య.

అంత బాధలోనూ నవ్వొచ్చింది రాజుకు. చిరునవ్వుతో "నాకు తెలియదు" అన్నాడు.

"పోనీ నీకేంతెల్సో చెప్పవయ్యా. మీ వెంకట్రామయ్య ఎక్కడుంటాడు? ఒక్క అడ్రసుచెప్పు చాలు. నిన్ను వెంటనే విడిచిపెట్టే ఏర్పాటుచేస్తాను, చెప్పు. తరచి, తరచి అడుగుతున్నాడు.

"నాకు తెలియదు. అసలా వెంకట్రామయ్య ఎవడో నాకు తెలియదని ముందే చెప్పానుగా".

"మళ్ళీవరస మామూలే. ఇదిగో రాజూ, డిస్ నాట్ గుడ్, ఇదేం మంచిది కాదయ్యా" అయినా నీఖర్మ, చేజేతులా జీవితాన్ని పాడుచేసుకొంటున్నావు సర్లే తీరిగ్గా ఆలోచించుకో. రేపు హైదాబాదునుండి ఎస్ బి. వాళ్ళువస్తారు. వాళ్ళముందు బ్రహ్మదేవుడుకూడ ఏమీదాచలేడోయ్. మర్యాదగా అడిగిందానికంతా టక టకమని జవాబులిచ్చేయ్. రేపుకూడ ఇదేవరసైతే నీ ఒళ్ళు చితగ్గొట్టేస్తాడు. మా ఎస్ ఐ. అంతేకాదు. నీ ప్రాణాలమీద ఆశకూడ వదులుకోవాల్సిఉంటుంది. ఇకవస్తా. ఇంట్లో మా ఆవిడ కాస్త ఆలస్యమైతే ఎగిరిపడుతుంది. సంసారం, సాగరంమరి. ఐనా బుద్ధిగా ఆలోచించుకో, ఈ వెర్రిమొర్రి వేషాలు మానెయ్ నీతండ్రిలాంటివాడ్ని. నేనుచెప్పిందివిను. నిన్ను అందలమెక్కించేట్లు చేస్తాను". అంటూ నిష్క్రమించాడు అప్పయ్య.

సూర్యుడెప్పుడో అస్తమించాడు. చీకటిపొడలాగా అనంతాకాశాన్ని ఆవరిస్తూంది. పోలీస్‌స్టేషన్‌లో కలకలం తగ్గింది. నిశ్శబ్దం ఆవహించింది. ఒకరొకరుగా జవాన్లు

ఇండ్లకు వెడుతున్నారు. రైఫిల్ చేతపట్టుకొని రాజుముందే నిలబడి ఒక పోలీసుకాపలా కాస్తున్నాడు.

చలిగాలి రివ్వున వీచసాగింది. పుండులో కారంపోసినట్లు దేహమంతా మండ సాగింది రాజుకు. బాధగా మూల్గుతూ అటూ, ఇటూ పొర్లుతూ ఉన్నాడు రాజు. నిద్ర పట్టడంలేదు. ఎట్లాపడ్తుంది? మనసే ఒక యుద్ధరంగమైపోయింది. ఆలోచనలు ప్రవాహాల్లా వచ్చిపడ్తున్నాయి. ఆలోచనలు— పరస్పరం సంఘర్షించే భావాలు... ... ...

"చదువుకొన్నవాడివి. హాయిగా ఉద్యోగంచేసుకుంటూ, పెండ్లిచేసుకొని కులాసాగా గడపకుండా......" ఎస్.ఐ. సీతారామయ్య గుడ్లు మిటకరిస్తూ తొంగిచూస్తున్నాడు. రాజు మనోపథంలో.

"అనవసరంగా ఒళ్లు పాడుచేసుకోకు" భూతంలా హుంకరిస్తున్నాడు సీతారామయ్య. అసహనంతో అటూ, ఇటూ కదిలాడు. ఎముకలు టపటపటమన్నాయి. జివ్వుమన్నది. ప్రాణాలు లేచిపోయాయి.

"చెప్పేస్తే? చెప్పేస్తేఏం? ఏదో కొద్దిగా చెబుతాం. పార్టీకి నష్టంలేని విషయాలు చెబుదాం. పోలీసులకు తెలిసినంతమట్టుకూ చెప్పి మిగతావి దాచేద్దాం" బలంగా ఒక ఆలోచనా ప్రవాహం.

"అది చాలా తప్పుడు ఆలోచన. ఒక్కసారి చెప్పడమంటూ మొదలుపెడ్తే, ఆ ప్రవాహం అంతటితో ఆగదు. కామ్రేడ్! మనం సర్వం త్యాగంచేసి ఈ విప్లవపోరాటంలో దూకాం. పెనుతుఫానులొచ్చినా చలించకూడదు. పోలీసులకు మనం ఏ విషయమూ చెప్పవల్సిన అవసరంలేదు. ఈ విషయమై జూలియస్ ఫ్యూజిక్ 'రక్తాక్షరాలు' చదవండి" గంభీరంగా ప్రతిధ్వనించింది వెంకటాద్రిమయ్యగారి కంఠం. సిగ్గుతో చచ్చిపోయాడు రాజు. తానేనా ఇలా ఆలోచిస్తున్నది? తనలో ఇంత బలహీనతా? ఒకసారి తానే ఎల్లయ్య ప్రభృతులతో అన్నమాటలు గుర్తుకొచ్చాయి. "కామ్రేడ్! పెను తుఫానులను ఎదుర్కొనగలవాడే కమ్యూనిస్టు అవుతాడు. వేలాదివీరులు తమ ప్రాణాల్ని పణంగా ఒడ్డి పోరాటంలో అమరులయ్యారు. వారి నెత్తుటిధారలతో గట్టిపడ్డ విప్లవ మార్గాన్నే మనం పయనించాలి."

ఉహుం— ఎన్నటికీ అలాకాదు. తాను పిరికివాడుకాకూడదు. అసలిలాంటి ఆలోచనలెందుకువస్తున్నాయి?

"రేపుకూడ ఇదేవరసైతే నీ ఒళ్ళు చితగ్గొట్టేస్తాడు మా ఎస్.ఐ. అంతేకాదు, నీ ప్రాణాలపై ఆశకూడ వదులుకోవాల్సివుంటుంది." మెత్తగా బెదిరిస్తున్నాడు అప్పయ్య.

ఉలిక్కిపడ్డాడు రాజు. జీవితం ప్రియమైన జీవితం— రేపటితో అంతమా? అను కొన్నదేదీ సాధించకుండానే, తృప్తి అనేది దొరకకుండానే చావు—.

భయంకర మృత్యురాక్షసి— వికటాట్టహాసాలుచేస్తూ రాజును కౌగిలించుకోబో తోంది.

"అమ్మా!" చిన్న కేకతో ఎగిరిపడికూర్చున్నాడు. ఆవేదన మంటలాకాల్చేస్తోంది. అమ్మ. అక్క. నాన్న— ప్రియమైన నాన్నగారు— అందరూ కళ్ళముందు కదలాడ సాగారు. ఇంతేనా? రేపటితో జీవితం అంతమేనా? కన్నవారికి దూరంగా, మిత్రులకు దూరంగా అభాగ్యుడిలా మృతిచెందాల్సిందేనా?

"పోనీ, ఏదోకొద్దిగా చెప్పేస్తే కొద్దిరోజులు బ్రతికి ఉండేందుకైనా కనీసం అమ్మనూ, నాన్ననూ, చూచుకొనేవరకైనా" ఆలోచన వెర్రితలలు వేస్తూంది.

"చావు అనేది ప్రతి మానవుడికీ తప్పనిసరి. ఐతే ప్రజలకోసం మరణించడం హిమాలయపర్వతంకంటె గంభీరమైనదికాగా భూస్వాములకు, దోపిడీదారులకు సేవలు చేసే ప్రజా శత్రువుల మరణం ఈకకంటే తేలికైంది. చైర్మన్ మావో మెల్లగా మందలిస్తున్నాడు.

మొహం దించుకుపోయింది రాజుకు. బ్రతుకుపై ఆశతో ఎంత నైచ్యపు ఆలో చనలు వస్తున్నాయి? ఐనా చావు తప్పనిసరి అయినప్పుడు చావంటే భయంఎందుకు? భయపడి లాభంమాత్రం ఏమిటి?

తానేనా? ఒకప్పుడు "మృత్యువును ధిక్కరించే సాహసం అలవర్చుకోవాలి" అని శ్రీరంగనీతులు చెప్పింది?

అసలీ ఆలోచనలు తనకెందుకువస్తున్నాయి? తానింత బలహీనుడా? ప్రజలకు సేవచేయాలనే దీక్షతోగదా తానీ పోరాటంలోకి దూకింది. మరి అప్పుడు తనకీ కష్టాలు నష్టాలుంటాయని తెలియదా? మరీ రివిజనిస్టు ఆలోచనల్ని ఎలా అనుమతిస్తున్నాడు తాను?

"నిర్బంధానికి భయపడి రివిజనిస్టులంకాము" అమర పాణిగ్రహి గానం అనం తాన్ని నింపివేస్తూ వినిపించసాగింది.

కాడు కాడు రాజు ఎన్నటికీ రివిజనిస్టుకాడు. తన పార్టీకి, ప్రజలకు ద్రోహం చేయలేడు.

"వేలాది, లక్షలాదివీరులు తమ ప్రాణాల్ని అర్పించి పోరాటాన్ని వృద్ధిచేసారు. వారి రక్తంతో ఎరుపెక్కిన ఎర్రజెండాను మరింత పదిలంగా నిల్పుకోవాలి".

చైర్మన్ మావో ఉద్బోధిస్తున్నాడు. ఔను తానూ ఆ వీరుల సంప్రదాయాన్ని నిలబెట్టాడు. తప్పదు. రాజు ద్రోహికాలేడు. పిరికివాడు కాలేడు. రాజు విప్లవకారుడు. ప్రజాసేవకుడు. పెనుతుఫానులకు, పెనుమంటలకూ చలించక నిలిచేవాడే కమ్యూనిస్టు. రాజు కమ్యూనిస్టు అవుతాడుకాని, ఇంకోవిధంగా అవలేడు. అవకూడదు.

మథనపడుతున్న మనస్సు కుదుటపడ్డది. సంఘర్షించే ఆలోచనా ప్రవాహాలు ఒక కొత్తభావాన్ని పుట్టించాయి. దృఢనిశ్చయంతో పిడికిలి బిగిసింది. అప్రయత్నంగా నోటిలోంచి,

"కష్టాలు, నష్టాలు ఓర్చుకొని వుంటాము
ఎందాకా రమ్మన్నా అందాకావస్తాము"
"యమయాతనలు పడియైనా సుఖమనుభవించాలి
మనకున్నా లేకున్నా మనముందుతరమైనానూ
ఎందాకానేస్తం అందాకావస్తాము
ఎందాకారమ్మన్నా అందాకా వస్తాము

అంటూ కూనిరాగం వెలువడింది. ఒక అనిర్వచనీయానందం శరీరాన్ని పులకితం చేసింది. రివ్వునవీచే చల్లగాలి జోలపాటపాడగా కుదుటపడ్డ మనసుని ద్రినాహ్వానించింది.

వ్యాసం

## అమరకవి. సుబ్బారావు పాణిగ్రాహి

భూషణం

పాణిగ్రాహి అనగానే గిరిజన విప్లవపోరాటం గుర్తుకువస్తుంది. వెంపటాపు సత్యం మాట: పాణిగ్రాహిపాట గిరిజనులు విప్లవించడానికి తోడ్పడ్డాయి.

సహజంగా ఆయుధధారులైన గిరిజనులు అరణ్యప్రాంతంలో క్రూరమృగాల బారినుండి రక్షించుకొనేందుకు తమ తమ ఆయుధాలను ఉపయోగించేవారు. అమాయకులూ కష్టజీవులూ అయినవారిని దళారులూ, భూస్వాములూ దోచుకుంటూ తమ బొజ్జల్నీ, గాదెల్నీ నింపుకుంటుండేవారు.

కమ్యూనిస్టుపార్టీ వారి దృష్టిని తమ జీవితంవైపునకు మళ్ళించింది.

అరణ్యంలో క్రూరమృగాలకంటే క్రూరాతిక్రూరమైన దోపిడీ మీ జీవితాన్ని పట్టి పీడిస్తున్నదనీ పెద్దపులికంటే క్రూరమైన పీడకులు మీ జీవితాన్ని పట్టి, మీ రక్తం చెమట దోచేస్తున్నారనీ; మీ మీ ఆయుధాలు క్రూరమృగాలకంటే క్రూరమైన దోపిడీ దారులను నిర్మూలించడానికి ఉపయోగించండనీ: ఉపదేశించి విప్లవీకరించిన ఘనత పాణిగ్రాహి సాహిత్యానికి దక్కింది.

"కొండజనం" అన్నపాటలో

'కల్లకపటములేని - చల్లనీవారయ్యా
వల్లమాలిన బతుకు - విశ్వాసమున్నోరు.
కొండకోనలలోన - ఉండేటి జనమయ్యా
బండచాకిరి చేస్తూ - బతుకుతూ ఉంటారు.
బెబ్బులీనైనాను - నిబ్బరించాగలరు.
జబ్బ సత్తువకూడ - అబ్బ చాలాగలదు.'

అలాంటి జనానికి కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని సులభశైలిలో పాటలుగా వ్రాసి గిరిజనుల రక్తంలోకి పాణిగ్రాహి పంపించారు.

శ్రీ కాకుళంజిల్లాలో కమ్యూనిస్టుపార్టీ ఎదుగుబొదుగులమీద పాణిగ్రాహి కవిత్వం ఆధారపడివుంది. నిరంతరం ఉద్యమంలో ఒకనిగాపనిచేస్తూ ఉద్యమ కార్యకలాపాల్నే పాటలుగావ్రాస్తూ పాడుతూ సుబ్బారావు పాణిగ్రాహి శ్రీకాకుళ ఉద్యమమే తనుగా తానే శ్రీకాకుళ ఉద్యమంగా ఐక్యతచెందారు.

శ్రీకాకుళంలో కమ్యూనిస్టుపార్టీ- "అయ్యో అయ్యో"! పార్టీగా ఉంటున్నప్పుడు పాణిగ్రాహికూడా "అయ్యో అయ్యో!" కవిత్వం వ్రాశారు.

• పార్టీ కార్యకలాపాలు పార్లమెంటుకు పరిమితంచేయబడి, కష్టజీవుల సమస్యల్ని కసాయివానికి వినతివ్రతలూ ఊరేగింపులూ బహిరంగసభలూ పేపరు ప్రకటనలూ, అసెంబ్లీలో ప్రశ్నలరూపంగా మనవిచేస్తున్నప్పుడు- పాణిగ్రాహి కవిత్వంకూడా పరిష్కారాన్ని సూచించకుండా పరిస్థితినే వివరిస్తూపోయింది.

"దొంగాటకం" అన్న పాటలో

"మునగచెట్టులోన చేవ
సోదరా ఉందంటే నమ్ముతావా?!
నేతిబీరకాయలోని నెయ్యి
ఏది మచ్చుకైన కొంతపైకితియ్యి!"
అంటూ

"రేషనుకై కొట్టుముందు నిలబడు
'స్టాకు'లేదంటే ఇంట్లో సాగిలబడు
ఆకలేస్తె గోడవంకచూసుకో!!
పచ్చి మంచినీళ్ళు కడుపులోన
పోసుకో!!"అన్నారు

"జనం నడవాలీ" అన్న పాటలోకూడా

"ఎన్నాళ్ళీకాపురాలూ!
ఏ చెరో గిరోపడి చేద్దామన్నా
ఎట్లాగీ కాపురాలూ!
చేలన్నీ చెమటనుతడిపీ

నేలా బురదా నాటులునాటీ
కళ్ళప్రాణముతొ ఇల్లుజేరితే
పిల్లలుతింటే తల్లులుపస్తు!
ఎన్నాళ్ళీకాపురాలు?!" అని

జన జీవితాన్ని వారిముందర వివరించుకుంటూ పోయారు.

అనాటి "అయ్యో అయ్యో" కమ్యూనిస్టుపార్టీ ఎన్నికలు ప్రధానాశయంగా పెట్టుకుంది.

పార్టీ కార్యక్రమం ఖచ్చితంగా అమలుజరుపుతూ పార్టీలో అంతర్భాగంగా ఉన్న సుబ్బారావు పాణిగ్రాహి ఎన్నికల ప్రచారంచేసేవారు. ముఖ్యంగా మహిళా దళాన్ని నడుపుతూ కమ్యూనిస్టుపార్టీకి ఓట్లెయ్యమని నినాదాలిస్తూ, గోడలమీద గుర్తులు వేస్తూ అభ్యర్థులపేర్లువ్రాస్తూ జెండాలు తయారుచేసి కట్టేవారు.

పార్టీ అంటే గిట్టని గ్రామాల్లో ఆయన ఇళ్ళమీద జెండాలుకట్టే అవకాశంలేక చెట్లమీదకట్టేవారు. గోడలమీద నినాదాలు వ్రాసేవారు. అక్కడున్న భూస్వాములు చెట్లమీద జెండాలుకూడా ఉంచ నిరాకరించి తమ గులాములచేత లాగించేసేవారు. గోడలమీద నినాదాలకు పేడ జల్లించేవారు. ఇదిచూచి సుబ్బారావు పాణిగ్రాహి కదిలి—

"ఎరుపంటే కొందరికి భయం భయం
పసిపిల్లలు వారికంటె నయం నయం.
ప్రకృతిలో పూలు ఎరుపు మందారం
స్త్రీలనుదట తిలకం ఎర్రని సింధూరం",

అని వ్రాసి ఎరుపు నీ రక్తంలోనేఉందనీ జెండాలు పీకించినంతమాత్రాన ఎరుపు మాసిపోదనీ వివరించారు.

కాంగ్రెసుపార్టీ అవతారపురుషుడూ భారత దేశానికి మహాత్ముడూఅయిన అహింసా మార్క్సు గాంధీగార్ని కాంగ్రెసువాళ్ళు ఉత్సవ విగ్రహంగామార్చి ఆయన విధానాల్ని తుంగలోతొక్కినా భారత కమ్యూనిస్టుపార్టీ ఆయనను వదలలేదు

నాటి కమ్యూనిస్టుపార్టీకి మార్క్సు, ఏంగెల్సు లెనిన్ స్టాలిన్ గాంధీ అంతా ఒకలాగే కనిపించి అహింసామార్క్సు కమ్యూనిస్టుపార్టీగా ఉండేది.

శ్రీకాకుళంలో గిరిజన సంఘాలు అక్కడి భూస్వాములకు మాత్రం కంటక ప్రాయంగా తయారైనాయి కూలిరేట్ల పెంపుదల, కంట్రోలుధరలకు సరుకులమ్మకం

దొంగరవాణాల్ని అడ్డడం. వారికి గిట్టలేదు. అంచేత పార్టీని ఎలాగైనా అణిచివేయా లని వారు సర్వవిధాలా సన్నాహపడుతూ ప్రభుత్వ సహకారంకూడా పొంది ఎక్కడి కక్కడ కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తల్నీ నాయకుల్నీ కొట్టించడం సాగించేరు.

కుదమగ్రామంలో భూస్వాములకు వ్యతిరేకంగా 'కొండదొరల'చేత చేపలు పట్టించినప్పుడు ఆదిభట్ల కైలాసంగార్ని కొట్టించేరు. గుమ్మలక్ష్మీపురం సంతలో పార్టీ ప్రచారం చేస్తుండగా వసంతాడ రామలింగాచారిగార్ని కొట్టించేరు. తిరిగి వారిమీద పోలీసు కేసులు పెట్టారు.

అలాంటి హింసాకాండ అక్కడ జరుగుతున్నప్పుడు కమ్యూనిస్టుపార్టీ దెబ్బకు దెబ్బగా వ్యవహరించకుండా ఓర్మిని ప్రబోధిస్తూ ప్రధానికి లేఖలూ ప్రకటనలూ సంతా పాలూ నిరసనలూ తెలియజేస్తూ కాలక్షేపంచేసింది. అప్పుడు పాణిగ్రాహి హృదయం క్షోభించి

"ప్రతీకారం చెయ్యలేక కాదు
క్రమశిక్షణ సిద్ధాంతం
మమ్మల్ని ఆపేశాయి" అన్న అర్థంలో కవిత వ్రాశారు.

నిజానికి కమ్యూనిస్టుపార్టీ ఆనాడు శ్రీకాకుళంశాఖను ఇముడ్చుకోలేకపోయింది. రోజుకోవిధంగా రాజుకుంటూ అగ్నిగోళంగా మారుతున్న శ్రీకాకుళాన్ని ఎలా రక్షించు కోవాలో పాపం నాయకులకు రివిజనిస్టు కళ్ళద్దాల్తో ఎంతవెతికినా వ్యూహమూ, ఎత్తు గడలూ దొరకలేదు.

కానీ అక్కడి భూస్వాములుమాత్రం వారికున్న ఎత్తుగడలతో వ్యూహంతో ముందుకువచ్చారు.

శ్రీకాకుళం చారిత్రకంగా మలుపుతిరిగినరోజు అది. 1968 అక్టోబరు 31న గిరి జన మహాసభకు వస్తున్నవార్ని భూస్వాములగుండాలు లేవిడివగ్గర కాచికొట్టడం, అడ్డు కునేందుకు సభకు హాజరైన సభ్యులు కదిలి ప్రవాహంగా వస్తున్నప్పుడు చెట్టుచాటు నుండి కొండగొర్రి మంగన్న ఆరిక కువారలనుకాల్చి చంపడం; అదేపాణిగ్రాహి చేత "అక్టోబరు 31" అన్న గేయం వ్రాయించింది జముకులకథగా పాడించింది ఆ సంఘ టన ఆధారంగా ఆనాటి జనశక్తిలో 'శూలపాణి'కూడా సుదీర్ఘమైన కవితవ్రాశాడు.

"ఈ రక్తం ఒక మహత్తర
శక్తిని సృష్టిస్తుంది.
ఈ బాధకు భవిష్యత్తు
తగినమూల్యం చెల్లిస్తుంది."

నిజంగానే తగినమూల్యం చెల్లించడం జరిగింది.

డాంగే 'మార్క్స్' పార్టీ, సుందరయ్య 'మార్క్సి' పార్టీగా మారినా శ్రీకాకుళం ఒక ప్రశ్నగానే మిగిలింది!. పశ్చిమ బెంగాల్‌లో, కేరళలో కమ్యూనిస్టుపార్టీ 'మార్క్సిస్టులకు' హెచ్చుసీట్లు రావడంతో మళ్ళీ విప్లవ పదజాలపు పార్లమెంటు పార్టీగా అది కూడా మారిపోయింది. అప్పుడు పాణిగ్రాహి వార్ని ఎగతాళిచేస్తూ

"కలకత్తా కాళిక నాలిక
రుచిమరిగెను మధురమితాయి!" అన్న పాటవ్రాసి పాడారు.

పాణిగ్రాహి ఆటపాటలూ, సూటి విమర్శలూ సహించలేకపోయిన సుందరయ్యగారు ఏలూరుసభలో చివరికి ప్రజలనే ప్రశ్నించారు.

"నా ఉపన్యాసం కావాలా?, సుబ్బారావు పాణిగ్రాహి జముకులకథ కావాలా?!" అని.

జనమంతా ముక్తకంఠంతో
"ఉపన్యాసాలు వింటూనేఉన్నం. పాణిగ్రాహి జముకులకథ కావాలని" జవాబుగా చెప్పారు.

పాపం మరి చేసేదిలేక ఉపన్యసించకుండానే ఆయన వెళ్ళిపోయారు.

అదేరోజుల్లో ఆయన "కాలచక్రం"అన్న నాటకంవ్రాశారు. (వ్రాతప్రతి ఎక్కడుందో తెలియదు.) నిముష నిముషానికీ మారిపోతున్న ఆనాటి పరిస్థితులు నాటక ప్రదర్శనకు వ్యవధి చిక్కనివ్వలేదు.

అప్పుడే... సరిగ్గా అప్పుడే నగ్జల్‌బరీలో నిప్పంటుకుంది. శ్రీకాకుళానికి దాని యొక్క కాంతులు స్పష్టంగా కనిపించాయి. కమ్యూనిస్టుపార్టీ తన విధానాల్ని ఆ కాంతుల్లో దిద్దుకోగా పాణిగ్రాహి తన కవిత్వాన్నికూడా దిద్దుకున్నారు.

అంతకుముందు వ్రాసినపాటలు మారిన పరిస్థితులకనుగుణంగా మార్చుకున్నారు.

(1) "ఎందాకనేస్తం? ఆగాగువస్తాం.
అందరంకలిసేకా ముందుకేపోదాం." అన్న పాటలో—

"ఆగాగువస్తాం" అన్న మాటతీసేసి "ఎందాకనేస్తం? అందాకవస్తాం" అని మార్చేశారు.

అలాగే "ఎడమచేతపట్టవోయి ఎర్రనిజెండా!
పిడికిలి బిగించవోయి వేరొకచేత" అన్నపాటలో—

"పిడికిలి బిగించవోయి వేరొకచేత" తీసేసి "తుపాకిపట్టవోయి వేరొకచేత" అని చేర్చారు.

పార్టీ కార్యక్రమం మారేసరికి పాణిగ్రహి కలం పరవళ్ళుతొక్కింది. విప్లవో త్సాహంతో విరుచుకుపడింది.

"పిలిచింది ఎర్రజెండా
పలికింది కొండ కొండా" •
అంటూ
"దిక్కు మొక్కు లేని జనం
ఒక్కొక్కరు అగ్నికణం
సింహకంఠ నాదంతో
వస్తారిక కాచుకొండి"

అని సవాల్ చేయగా శ్రీకాకుళం జూలుదులిపి ముందుకుగూకింది. అలా శ్రీకాకుళం మండింది యావద్భారతం మండుతుంది.

## స్మృతులు

కవి. గాయకుడు. నాటకకర్త వాయిద్యకారుడూ. విప్లవ కార్యశీలుడూ అయిన పాణిగ్రాహి గొప్ప సమయస్ఫూర్తి కలవారుకూడా!. ఆయన ఎక్కడవుంటే అక్కడ నవ్వులు పువ్వులుగా వికసించి హాస్యం ఆనందంగా నర్తించేది.

కాశీబుగ్గ యువజన మహాసభ స్థలాలంకరణలో ఆయన నిమగ్నమై ఉండగా హెచ్చు సంఖ్యలోవచ్చిన అతిధులను ఆయనకు పరిచయం చెయ్యడంలో ఆయన ఒక్కొక్కరికీ 'నమస్కారం, నమస్కారం' అని చెప్పవలసిరావడంచేత షుమారు అరగంట పని ఆగిపోయింది.

పరిచయాలూ నమస్కారాలూ ముగిసిపోయి అతిధులు దూరంగాపోయిన తరువాత పాణిగ్రాహి పక్కనున్న స్నేహితులతో నవ్వుతూ త్యాగరాజు కీర్తనని తిరగవేసి చెప్పారు.

"ఎందరో మహానుభావులు
అందరికి నాదు వందనాలని"; త్యాగయ్య ఎలా అన్నాడోగానీ పని అరగంట పాడైనతరువాత నామట్టుకునాకు

"అందరూ మహానుభావులే!
ఎందరికని నా వందనాలు!" అనాలనిపిస్తుందన్నారు.

నర్తనశాల హరికథచెబుతూ ఆయన గ్రామగ్రామాలు తిరిగేవారు. పార్టీ బలంగా ఉన్న గ్రామాల్లో స్వాగత సత్కారాలు లభించేవి. పార్టీలేనిదగ్గర అనేక ప్రశ్న పరంపరలు ఆయనకు ఎదురయేవి

శ్రీకాకుళంజిల్లా హిరమండలంలో ఆయన కథచెబుతూఉండగా మధ్యలో ఒకాయనలేచి

"రష్యా మనదేశంమీద దండెత్తితే మీవైఖరేమిటి?"అని ప్రశ్నించాడు.

"దండెత్తదు"అని పాణిగ్రాహి సమాధానంగా చెప్పారు.

"ఒకవేళ దండెత్తితే మీవైఖరేమిటి?"అని తిరిగి ప్రశ్నించాడు.

"దండెత్తదండీ!"అని ఓపిగ్గా సమాధానంచెప్పారు.

"అహా! దండెత్తితే అసలు మీవైఖరేమిటి?" మూడోసారికూడా మొండిగా ప్రశ్నించాడు.

సుబ్బారావు పాణిగ్రాహి వెంటనే

"మీ అత్తమూతికి మీసాలు మొలుస్తాయా?"అని అడిగారు.

జనం గొల్లున నవ్వేరు.

అతను "మొలవ్వని" సమాధానంగా అన్నాడు.

"ఒకవేళ మొలిస్తే?"అని పాణిగ్రాహి అడిగారు

"మొలవ్వ" అని ఖచ్చితంగా సమాధానంవచ్చింది. అప్పుడు పాణిగ్రాహి తీర్పుగా చెబుతూ

"మీ అత్తమూతికి మీసాలు మొలవని నువ్వెంత గ్యారంటీగా చెబుతున్నావో, రష్యా మనదేశంమీదికి దండెత్తదని నేనూ అంత గ్యారంటీగా చెబుతున్నాను"అన్నారు.

అతని సమయస్ఫూర్తి ప్రేక్షకులను నవ్వించగా, ప్రశ్నించేవాడికి ఆశ్చర్యాన్ని కలిగించి, మరి మాటరాక నోరుమూయించింది.

పార్వతీపురంలో పాణిగ్రాహి జముకులకథ చెబుతుండగా ప్రేక్షకులలో ఒకరు "మీకు తిథి వారనక్షత్రాలమీద నమ్మకంఉందా?" అని ఒక చీటీమీదవ్రాసి పంపించారు.

పాణిగ్రాహి చీటిచదివి సమాధానం చెప్పకుండా ఒక పక్కన పడేసారు. ప్రేక్షకులనుండి కొందరు చీటీలోనిప్రశ్నకు సమాధానం చెప్పాలని పట్టుపట్టారు. పాణిగ్రాహి పక్కనపడేసిన చీటితీసి ఒకసారి చూసి

"సంతకంలేని ప్రశ్నలకు సమాధానం చెప్పబడదు" అన్నారు.

వెంటనే మరొక చీటి పాణిగ్రాహిగారి దగ్గరకు వచ్చింది. దాన్ని అందుకొని ఏగాదిగా ఒకసారి చూసి మైకుదగ్గరకువచ్చి ఏదో మాటాడుతున్నట్టుగా పెదవులుకదిపి ఊరుకున్నారు.

ప్రేక్షకులంతా మాకు వినబడలేదన్నారు.

అప్పుడు సుబ్బారావు పాణిగ్రాహి నవ్వుతూ

"ఈ చీటిలో ప్రశ్న పంపినవారు" ఆకాశరామన్నట! "ఆకాశరామన్న ఎవరికీ కనిపించడుగాబట్టి కనబడని మనిషిప్రశ్నకు వినబడని సమాధానం చెప్పానన్నారు".

ప్రేక్షకుల హర్షధ్వానాలమధ్య ఆయన జముకులకథ చెప్పుకుపోయారు.

అన్ని కళలలో ప్రవేశంఉన్నవ్యక్తి జీవితమంతా కమ్యూనిస్టుపార్టీకోసం, విప్లవ జీవితంకోసం అంకితమైపోయి అమరుడవడం భారత దేశ చరిత్రలోనే రక్తాక్షరాలతో లిఖించదగ్గది. ప్రతి కళాకారుడూ అనుసరించదగ్గది.

"అమరకవి సుబ్బారావు పాణిగ్రాహి!
అందుకో మా విప్లవ జోహార్లు!"

## స్వదేశీ బాంబు

టి.కె. మహదేవన్

స్వదేశీ బాంబును రెండురకాలుగా చూడవచ్చు. నిటారుగా నిలబెట్టి చూడు. అచ్చం బాంబులాగానే వుంటుంది. తలకిందులుగా నిలబెడితే అది అపాయంలేని ఆట వస్తువులాగా కనబడుతుంది. అదీ స్వదేశీబాంబు అసలుసంగతి.

దీని లావాదేవీలు :

---

మందుగుండు సామానుజోలికి పోవడం మనకు ఇష్టంలేకపోవచ్చు. చిన్నప్పుడు చదివాం గుర్తుందా "బాంబులన్నీ తంత్రాలేకాని తంత్రాలన్నీ మాత్రం బాంబులు కావు" అని? అది ముమ్మాటికీ నిజం. కనక మనం బుర్ర పాడుచేసుకోవద్దు. స్వదేశీబాంబు భ్రాంతీకాదు, రాజస్థాన్ ఎడారిలోని ఎండమావీకాదు. వాస్తవమైనది. అందంలాగానే బాంబుకూడా చూసేవాడి దృష్టినిబట్టి వుంటుంది. నువ్వు రాబందువయితే అది బాంబు లాగానే వుంటుంది. రామచిలకవయితే అదో మరలెమ్మని సరిపెట్టుకుంటావు.

మామూలుగా బాంబులు గుండ్రంగా శివలింగాల్లా వుంటాయి. కాని స్వదేశీ బాంబుకు మాత్రం రెండు కొసలున్నాయి. ఒకవైపు నిలబెడితే అది దర్జాగా చొక్కా చేతిమీద తగిలించుకునే భుజకీర్తిలా వుంటుంది. మరి యుద్ధభేరీ మోగినప్పుడు విదేశాల్లో సైనిక విన్యాసాల్లో బుగులుకునే జనం గుండెలకన్నా డాబుసరిగామండే భుజకీర్తి మెరుగు.

స్వదేశీ బాంబును అడ్డంగా పెట్టిచూస్తే జగన్నాధరధంలా వుంటుంది తన ఇనప పాదాలకింద మనందరినీ ఎలా అణగదొక్కుతుందో చూడు. కలవాళ్ళు. లేనివాళ్ళు అంతా నలిబలి అవుతారు. కాని ఉన్నవాడికైతే వాడి కొవ్వు రబ్బరులాగా దాన్ని తిప్పి కొడుతుంది. లేనివాడికి కొవ్వు లేదుగనక ఉన్న ఎముకలగూడు నలగక తప్పదు.

మారణ హోమం :

దినం గడిస్తే తనం గడిచినట్టా ? ఒక్క స్వదేశీ బాంబుతోనే మనకు మారణా యుధాలున్నట్టా ? కాని కిటుకు అందులోనే వుంది. బాంబులు పెరిగినకొద్దీ తింకి తగ్గడం ఖాయం.

మరి మనం ఏంచెయ్యాలి ?

ముచ్చటగా మూడు దోవలున్నాయి.

1) మనని మనం దగాచేసుకుని కొండంతను గోరంతచేస్తే సరి 'బాంబు దే ముంది. అదో చిన్న తంత్రం' అంటే సరి. కాని యిదెంత కాలం సాగుతుంది. "వాములుతినే స్వాములకు పచ్చగడ్డి ప్రసాదమా ?" అన్నట్టు కొండనుకొట్టే యంత్రానికి బస్తీలను ధ్వంసంచేయడం ఒక లెక్కా ? ఎంత వెర్రివాడికైనా తెలుస్తుందిది.

2) సర్వసంగ పరిత్యాగం : మరో మార్గమేదంటే మనం గర్వంతో బోర విరుచుకుని సిపాయిల్లా ఠీవిగా కవాతుచేయడమే. వచ్చిన చిక్కల్లా ఒకటే— బోర విరిచినా డొక్క నిండదు.

3) ఇక మూడోది నాదారి— సన్యాసం. అన్నీ ఒదిలేసి, గోచీపెట్టుకుని స్వదేశీ బాంబు చేయడం. ఈ పని ఏనాడో చెయ్యాల్సింది. మరేం ఫర్వాలేదు. కర్ణుడు మన వాడే, కుంభకర్ణుడూ మనవాడే. లే, నడుంకట్టు. చిలిపిపనులు మానేసి నీ విధి నిర్వహించు.

ఏమిటావిధి ? మోహనదాస్ గాంధీనడుగు, చెప్తాడు.

[టైమ్స్ ఆఫ్ ఇండియా సౌజన్యంతో 29-5-74]

అనువాదం :— చలసాని ప్రసాద్

---

## రెడ్ కార్పెట్

గిటారు విసిరిపారెయ్
ట్రిగర్ నొక్కు
సమ్మె హర్తాల్
జానేదో బ్రిగేడియర్
బోధకా ప్రబోధకా
గుడ్ బై
బరిలో నిలబడ్డవాడా
రెడ్ కార్పెట్

సౌరభి

# రచయితలకు వ్యతిరేకంగా ప్రభుత్వం కుట్ర

"విరసం సభ్యులను జైల్లో తోసేయడం ప్రభుత్వానికి మామూలై పోయింది. కిందటిసారి అక్టోబర్ - నవంబర్ 1973లో విరసం సభ్యులైన వరవరరావు, చెరబండ రాజు ఎం.టి. ఖాన్‌లను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఫాసిస్టు శాసనమైన ఆంతరికభద్రతా చట్టంకింద అరెస్టు చేసింది. అంతకు పూర్వం 1971 లో జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజులను పి.డి. చట్టంకింద నిర్బంధించింది. స్వేచ్ఛాభివ్యక్తిని శాంతి భద్రతలకు వ్యతిరేకమని భావించే ఈ ప్రభుత్వంపై ప్రజావ్యతిరేక చట్టాలు సరిపోలేదని ఈ సారి ప్రజారచయితలను సరికొత్త కుట్రకేసులో యిరికించి తన ఫాసిస్టు లక్షణాన్ని వ్యక్తంచేస్తూ స్పష్టంగా రచయితల విరుద్ధంగా కుట్ర పన్నింది.

ఇంత క్రితమే యితర కుట్రకేసులను బనాయించి కానూసన్యాల్, నాగభూషన్ పట్నాయక్ తదితర విప్లవకారులను యీ పాలకవర్గం నిర్బంధించింది. ఇప్పుడు సికింద్రాబాద్ కుట్రకేసు అనబడేదానిని సృష్టించి విప్లవకారులతోబాటు ఈ రచయితలను కూడా యిరికించి హత్యా, దోపిడి, చట్టబద్ధంగా ఏర్పడిన ప్రభుత్వాన్ని సాయుధంగా కూల్చే ప్రయత్నంలాంటి ఆరోపణలు చేసింది. ఈ విధంగా యీ ప్రభుత్వం నిజం మాట్లాడ్డం, స్వేచ్ఛగా తిరగడం, రచనలు చేయడమనే హక్కును కాలరాయడంలో విప్లవాత్మకమైన అభివృద్ధిని సాధించింది. ఈ కుట్రకేసులో 46 మందిని విచారిస్తున్నారు. ఇందులో విరసం కార్యదర్శి మధుసూదనరావు, సృజన సంపాదకులు వరవరరావు, ప్రఖ్యాత తెలుగు విమర్శకులు కె.వి. రమణారెడ్డి, యం. టి. ఖాన్, పిలుపు సంపాదకులు ఎం. రంగనాథం, సుప్రసిద్ధకవి చెరబండరాజు యీనాడు జైల్లోవున్నారు.

ఇలాంటి దమనకాండ దేశవ్యాపితంగా జరుగుతోంది. రచయితలు వీటినుంచి గుణపాఠాలు నేర్చుకోవాలి. బెంగాల్‌కవి సృజన్‌సేన్, అభ్యుదయ పత్రిక "నక్షత్రేర్ రోద్" ఎడిటర్ సవ్యసాచి, ఆయనభార్య శ్రీమతి రత్నాదేవిని ఒక అబద్ధపుకేసులో ఇరికించి అరెస్టుచేసారు. ముజఫర్‌పూర్‌కుచెందిన రచయిత సురేశ్‌శర్మ రెండు వారాల పాటు ఆంతరిక భద్రతాచట్టంకింద జైల్లోవుండి బయటకిరాగానే తిరిగి మరోకేసులో ఇరికించి అరెస్టుచేసారు. పంజాబ్‌లో రచయిత హరభజన్ హలవారవీ మూడునెలలనుంచి లూధియానా జైల్లో- వున్నారు. ఆయనపై హత్య, దోపిడినేరాలు మోపబడినాయి. తలవండిలోని సలేమగ్రామంలోని కవి పాశ్‌ను, మంగూవాల్ గ్రామనివాసి కవి దర్శన్ ఖట్‌కర్, మాల్వాడీనుండి వెలువడే పక్షపత్రిక 'జత్తేబందీ' ఎడిటర్ మహేంద్రసింగ్ సంధూ, మాసపత్రిక "మా" ఎడిటర్ కేవల్‌కార్. ఆమెభర్త రమేష్‌హాండా నిర్బంధించబడ్డారు. మథురానుంచి వెలువడే "ఉత్తరార్ద్" సంపాదకులు సవ్యసాచి. రతలామ్ నుంచి వెలువడిన పత్రిక "కంక్" ఎడిటర్ నిర్మల్‌శర్మా MISA కింద జైల్లోవున్నారు. క్రమంగా ఈ పరిస్థితి ఇలానే కొనసాగితే కష్టజీవుల సామాన్యుల సమస్యలను పట్టించుకొని రచనలుచేసే ప్రతి రచయితను ఈ పాలకవర్గం భవిష్యత్తులో ఇలానే పీడించనున్నది. అయితే ప్రజలపక్షం వహించే రచయితల కలాల్లో ఈ పాలకవర్గాలకుట్రను కూలదోసే శక్తివుంది. ఇప్పుడే మేల్కొని రచయితలందరు ఐక్యసంఘటనగా పోరా

టం సాగించనిపక్షంలో సాహిత్య రక్షకులుగామారిన పోలీసులు ఏదోరాత్రివచ్చి నిరాయుధులైన రచయితలను లాక్కెళ్ళిపోయి ఎక్కడో ఏకాంతంలో కాల్చివేసినా ఆశ్చర్య పడనక్కరలేదు- గతంలో సుబ్బారావు పాణిగ్రాహి, సరోజ్‌దత్‌లను కాల్చివేసిన సంగతి మనం మరచిపోరాదు.

బెంగాల్‌కుచెందిన యువకవులు-కళాకారులైన తిమిర్‌వరన్ సింగ్, అమియ చట్టోపాధ్యాయ్, ద్రోణాచార్యఘోష్, తుషార్‌చంద్రను జైల్లోనే కొట్టి చంపివేసారు. రచయితలు యీ నిర్బంధకాండను ఎదుర్కొననిపక్షంలో వాళ్ళకేకలు సాహిత్యానికి పదాలనుగాని, ప్రజలకు సందేశాన్నిగాని యివ్వలేవు అందువల్ల రచయితలందరు వీలైన చోట సభలు జరిపి, కరపత్రాలు ప్రచురించి నిరసన ప్రదర్శనలు జరపాలని విజ్ఞప్తి చేస్తున్నాము".

త్రిలోచన్‌శాస్త్రి, చంద్రబలిసింగ్, శివప్రసాద్‌సింగ్, విజయమోహన్‌సింగ్, సుఖదేవ్‌సింగ్, లాల్‌ధర్ త్రిపాఠీ ప్రవాసి, సదాశివ్ ద్వివేది, విశ్వనాథ్ ముఖర్జీ, శ్యాంతివారి, కంచన్‌కుమార్, వాచస్పతి సురేశ్ భ్రమర్, సుఖాంత్ ఛటర్జీ, రాజేంద్ర ప్రసాద్ దుబే, నరేంద్ర నీరవ్, హరినారాయణ్ రాహి, జమీల్ అహ్మద్, సంకట్ ప్రసాద్, యన్ భట్టాచార్య, ప్రకాశ్‌చంద్రజైన్, శంకర్ చౌదరి, రాజేంద్రప్రసాద్ అవస్తీ, అమిత్ ప్రకాశ్‌సింగ్, ఆర్ యస్ శర్మ, హరేరాం తివారి, విజయకుమార్ వొహరా, సురేంద్ర ప్రతాప్, యస్ అతిబల్, సుధేందు పటేల్, యోగేంద్ర నారాయన్, వీరేంద్ర శుక్ల, ప్ర. న. జింగరన్, సత్‌యోగి శివాజి, అరవింద్, ప్రదీప్ కుమార్, అర్జున్ కేసరి, కమలేందు భారత్ పైశ్యార్, ఉజ్వలకుమార్, అమితాబ్ చక్రవర్తి, శంభునాథ్ త్రిపాఠీ, సుజీత్ చక్రవర్తి, జుగునూ శారదేయ్, అరుణ కుమార్ మిశ్ర, యస్. అఫసల్, అశోక్ ముఖర్జీ, హీరాలాల్, సుధీర్ చటర్జీ, అరుణదత్, కృష్ణకుమార్, అజయకుమార్, జి బి మోహన్‌తంపి, శ్యాంబహదూర్ నమ్ర, అక్షయ ఉపాధ్యాయ, సులాన్ అబ్బాస్ రిజ్‌బీ, సురేష్ ప్రతాప్‌సింగ్, సోంనాథ్ త్రిపాఠీ, రవీంద్రనాథ్ ద్వివేది, నాగానంద్ ముక్తికంఠ్.

అనువాదం :- నిఖిల్ ['ఆముఖ్' జులై '74 సంచికనుండి]

---

**వ్యాఖ్య అనవసరం-** "...డబ్బుకి ఇవేళవున్న విలువ రేపుండటంలేదు. అందులోనూ ఈ మాయముండా ప్రభుత్వం వచ్చేక డబ్బువిలువ రోజురోజుకూ దిగజారిపోతున్నది. నాన్నగారు రూపాయికి పదహారుశేర్లు బియ్యం ఇచ్చే రోజుల్లో ప్రభుత్వం దగ్గర డబ్బు దాచటం ఆరంభించేరు. రూపాయికి శేరు బియ్యం ఇచ్చే రోజుల్లో ప్రభుత్వం అతని సొమ్ము తిరిగి యిచ్చింది. అంటే ఏమయిందో చూడండి; రూపాయి యిచ్చి అణా పుచ్చుకున్నట్లయింది. ఇంకా మరికొన్నాళ్ళకు యిప్పుడాయన దగ్గరున్న డబ్బు ధర కూడ పడిపోతుంది."

(మహదాశీర్వచనం- కాళీపట్నం రామారావుగారి కథల సంకలనం 'జీవధార' నుంచి)

ఉదయకిరణాల్లో

పిల్లల పాట :

## అ ఆ ఇ ఈ ABCD

వరవరరావు

పిల్లలార! తల్లివంటి విప్లవాన్నిపాడండి
పిల్లలార! వెలుగువంటి విప్లవాన్నిచూడండి
నీదినాది అనేలేదు భయంబెదురు అసలులేదు
అబద్ధాలు, అక్రమాలు, అసహ్యాలు ఆతల్లికి ॥పిల్లలార॥
మల్లెపూవువంటి మనసు చందమామవంటి చూపు
మంచువోలె కరిగిపోవు సుతిమెత్తని హృదయమ్ము
అన్యాయంపట్లమటుకు అగ్గివోలె మండిపోవు
ఆకలి రోగం దుఃఖం అజ్ఞానం తుడిచేసే
పోరాటం విప్లవం- ఆ పాటలుపాడండి ॥పిల్లలార॥
అ నుంచీ అడవి, ఆ నుంచీ ఆయుధం
ఇ నుంచీ ఇల్లు, ఈ నుంచీ ఈటె- ఈటెకూడ ఆయుధమే
ఇల్లుచక్కబెట్టాలని, ఇండియాను మార్చాలని
అమ్మవంటి అడవిలోన ఆయుధాలుపట్టుకొని
అన్నయ్యలు వున్నారు అక్కయ్యలు వున్నారు
మనకోసమె పోరాటం తెగించి చేస్తున్నారు ॥పిల్లలార॥
A నుంచీ ARMS తెలుగులోన ఆయుధాలు
B నుంచీ బెంగాల్, బెంగాల్‌లో నక్సల్బరి
C తో నేర్చేపేరు CHARU. మజుందార్
D నుంచీ DARE, సాహసించమని అర్థం
నక్సల్బరి సంతాల్‌తెగ చారుబాబు నాయకుడుగ
ఆయుధాలు పట్టుకొని జోతేదార్లతో పోరిరి ॥పిల్లలార॥
శ్రీకారంచుట్టిమీకు చదువుమొదలు పెట్టుతారు
శ్రీకాకుళమనేపేరు ఏ సారయినా చెప్పెనా?
సత్యమనే సారొక్కడు శ్రీకాకుళ అడవుల్లో
సత్యంకోసం సాయుధ యుద్ధంలో చనిపోయెను
ఏడేండ్లుగ యీ యుద్ధం సాగుతోంది దేశంలో
ప్రజాయుద్ధమని దీనిని పిలుస్తాము మనమంతా
మార్క్స్, లెనిన్, మావోలు మనకుచూపినట్టిబాట
ప్రజలుగెలుచుదాక మనం పోరవలెను నిరంతరం ॥పిల్లలార॥

[మే 10,
1974]

## 'ప్రజాస్వామ్య' దేశాల ఆదర్శం !

అమెరికా జైళ్ళన్నీ యివ్వాళ నల్లజాతి రాజకీయ ఖైదీలతో నిండివున్నాయి. అమెరికాలో ఒక నూతన పరిస్థితి ఏర్పడిందనడానికి యీ నిదర్శనంచాలు. సామ్రాజ్యవాద వ్యవస్థ పాశవికమైన ధమననీతికి వ్యతిరేకంగా నల్లజాతిప్రజలు స్థిరమైన ప్రతిఘటనతో పోరాడుతున్నారు. ఈ పోరాటాలను ఇదివరలో హింసా, మానభంగాలతో ఎదుర్కొనే పాలకవర్గాలు యిప్పుడు 'నాగరికమైనవి'. ఈ హింసలనే చట్టబద్ధంచేసి నల్లజాతులమీదనే మానభంగాలు దొమ్మీలు, దోపిడీలు, నల్లమందువంటి మత్తుపదార్థాల వినిమయంవంటి తప్పుడుకేసులుపెట్టి యావజ్జీవ శిక్షలకు గురిచేస్తున్నారు. ఐనా, యీనాడు రాజకీయ ఖైదీలను వదిలిపెట్టాలన్న ఉద్యమం మరింత బలపడుతున్నది ప్రతి తప్పుడుశిక్షా కొత్తగా వేలాది కంఠాలబలాన్ని నల్లజాతి విముక్తి ఉద్యమానికి ప్రోదిచేస్తున్నది. ఉత్తర కరోలినాలో నల్లజాతి రాజకీయోద్యమమూ, అణచివేత చర్యలుకూడ అంతకన్న తీవ్రంగావున్నాయి. 1972 జులైలోనే డజన్ మందికి పైగా రాజకీయ క్రియాశీల కార్యకర్తలపై అసంఖ్యాకమైన నేరాలుమోపారు. వారిలో ప్రముఖంగా పేర్కొనదగ్గ ముగ్గిరిలో ఒక భారతీయుడు టి. జె. రెడ్డి కవి, నాటక రచయిత కళాకారుడు. ఇతనికి 20 సంవత్సరాల శిక్షపడ్డది. ఇతనితోపాటు గ్రాంట్ (కెమిస్ట్, రచయిత, సదరన్ కాన్ఫరెన్స్ ఎడ్యుకేషన్ ఫండ్ స్టాఫ్ మెంబర్) పార్కర్ (సంఘసేవకుడు)కూడ వున్నారు. గ్రాంట్‌కు 25 పార్కర్‌కు 10 సంవత్సరాలు శిక్షపడ్డది వీళ్ళు ముగ్గురుచేసిన నేరాలగురించి సాక్ష్యంచెప్పినవారు దీర్ఘకాలమైన నేర జీవితంగడిపి కనీసం 100 సంవత్సరాల శిక్షకుఅర్హమై ఇంక నేరాతీతులు (Immune to crimes) గా ప్రకటించబడ్డవాళ్ళు!

పై ముగ్గురినీ వదిలిపెట్టాలని పెట్టిన అసంఖ్యాకమైన చట్టబద్ధమైన అపీళ్ళను అమెరికన్ కోర్టులు త్రోసిపుచ్చాయి. ఇప్పుడు యీ ముగ్గురినీ విడిపించుకొనడానికి దేశవ్యాప్తమైన ప్రజాందోళనా నిర్మాణం జరుగుతున్నది.

(THE CALL ఆధారంగా)

## పెట్టుబడి ప(పు)త్రికలు :

భారతదేశంలో పత్రికలు పాస్టర్ నాక్, సోల్జినిట్సైన్‌ల కోసం, నెరూడాకోసం కూడ ఎడతెగని కన్నీళ్ళు కారుస్తున్నాయి. కాని తమదేశంలోనే రచయితలు బంధించబడి కటకటాల్లో మ్రగ్గుతున్న విషయం చూడడానికికూడ వీటికి సమయం లేదు–

ఏవో ఒకటి రెండు చిన్న పత్రికల్లో ఆంధ్రలో కొంతమంది రచయితలు అరెస్టయ్యారనీ ఒకవార్త చూశాం– అది ఒకటి రెండు వాక్యాల రిపోర్ట్– కాని రిపోర్ట్‌నుబట్టే ("Something is rotten in Denmark") ఏదో కుళ్ళి కంపువేస్తున్నదనే విషయం వాసనకట్టగలిగాం– దయచేసి మాకు పూర్తి వివరాలివ్వండి. మా పాఠకులకు పూర్తి వివరాలు యిచ్చే అవకాశం కల్పించండి–

సుభాష్‌చంద్రబోస్, ఎడిటర్,
'స్ట్రీట్' మలయాల మాసపత్రిక, పలయం, త్రివేంద్రం.

అంతర్జాతీయ పోరాట ఐక్యత :

భారతదేశం జైళ్ళలో నక్సలైట్ ఖైదీలు అనుభవిస్తున్న క్రూరమైన హింసాకాండకు వ్యతిరేకంగా కెనడా, అమెరికా, పశ్చిమజర్మనీవంటి దేశాలనుంచి మేధావులు, విద్యార్థులు సంఘటితమై తమ ఆందోళనను, నిరసనను ప్రకటిస్తున్నారు– నక్సలైట్ ఖైదీలను రాజకీయ ఖైదీలుగా గుర్తించాలని వాళ్ళు కోరుతున్న కోరికలన్నిటినీ తాము బలపరుస్తున్నామని ప్రకటించారు– అట్లాగే 'అంతరంగిక భద్రతా చట్టం'. 'దేశ రక్షణ నిబంధనలు' వంటి చట్టాలను ఎత్తివేయాలని, అక్రమమైన అరెస్టులను నిలిపివేయాలని కూడా డిమాండ్‌చేశారు. పార్వతీపురం కుట్ర కేసు గురించి, నక్సలైట్ ఖైదీల నిరాహార దీక్షగురించి యిటీవల పశ్చిమ జర్మనీలో హెయిడల్‌బర్గ్‌లో జరిగిన విశ్వవిద్యాలయ విద్యార్థుల సమావేశంలో 7 పేజీల రిపోర్టు యిచ్చారు.

అరెస్టులు–ఖండనలు :

## ప్రభుత్వ దమనకాండకు వ్యతిరేకంగా ప్రజావాణి

### వారణాసిలో నిరసన ప్రదర్శన :

వారణాసి : 26 మే 1974 ;

దేశవ్యాప్తంగా జరిగిన రచయితల అరెస్టులకు వ్యతిరేకంగా చిత్తరంజన్‌పార్క్ నుంచి రచయితలు, కళాకారులు, ఉపాధ్యాయులు, కార్మికులు, విద్యార్థులుకలిసి ఒక ఊరేగింపుతీశారు. ఊరేగింపుముందు సుబ్బారావు పాణిగ్రాహి నిలువెత్తు చిత్రపటం– దానికింద "కామ్రేడ్ సుబ్బారావు పాణిగ్రాహికి లాల్‌సలామ్" అని రాసివుంది. ఇతర నినాదాల అట్టలు ఇలా వున్నాయి. "ఫాసిస్టు ప్రభుత్వమా ప్రజలున్నారు జాగ్రత్త! ప్రజా రచయితలను విడిచేయ్–" "ప్రజా రచయితలారా ! ప్రజలతోకలిసి పోరాడండి". "విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి " "కామ్రేడ్ సరోజ్‌దత్ జిందాబాద్".

'ప్రపంచ కార్మికులారా ఏకంకండి' తదితర నినాదాలతో ఊరేగింపు సోనార్‌పుర వరకు వెళ్ళింది. అక్కడే బహిరంగసభకూడా జరిగింది.

సభకు అధ్యక్షత వహించిన కవి త్రిలోచన్‌శాస్త్రి ప్రసంగిస్తూ పాలకుల దమనకాండను సహించడమంటే దానిని సమర్థించడమేనని, అందువల్ల ఈ దమనకాండను ప్రతి రచయిత ప్రతిఘటించాలని అన్నారు. యువ కార్యకర్త అశోక్ ముఖర్జీ మాట్లాడుతూ సాహిత్యవేత్తలు విస్తృతమైన పోరాటాల్లో పాల్గొనాలని చెప్పారు. ఆ తర్వాత రచయిత కంచన్‌కుమార్ ఉపన్యసిస్తూ రచయితల, రైల్వే కార్మికులు, విప్లవకారులవందరిని విడుదలచేయాలని డిమాండ్‌చేసారు.

విప్లవ రచయితల్ని, సంపాదకుల్ని కుట్రకేసుల్లో యిరికించి నిర్బంధించడం ప్రజల హక్కుల్ని హరించడమే అవుతుందనీ, భావస్వాతంత్ర్యాన్ని కాలరాసే ప్రభుత్వపు చర్యపట్ల తీవ్రమైన నిరసనను తెలియజేస్తూ వెంటనే వారిని విడుదలచేయాలని 'బరంపురం ప్రగతిశీల రచయితల' తరపున డా. పుప్పల లక్ష్మణరావు, విజయచంద్ర, తాతిరాజు, గోవింద వెంకటరావు, వి. ఏకాంబరం, కామేశ్వరరావు, బి నిర్మల్‌రావు డిమాండ్ చేశారు.

* * *

విప్లవ రచయితల అరెస్టులకు నిరసనగా ఆంధ్ర విశ్వవిద్యాలయ 'విద్యార్థి రచయితల సంఘ' పక్షాన యూనివర్సిటీ క్యాంపస్‌లో ది. 2-7-74 నాడు జరిగిన సభలో ప్రొఫెసర్ వేణుగోపాలరావు, ప్రొ: కె. వెంకటేశ్వర్లు, విశాఖ విరసం యూనిట్ కన్వీనర్ సి వి. సుబ్బారావు మాట్లాడుతూ హింస అంతర్భాగంగా నిర్మితమైవున్న ఈ వ్యవస్థలో హింస ప్రబోధిస్తున్నారనే నెపంమీద ప్రఖ్యాతరచయిత, మేధావి కె వి.రమణా రెడ్డితోసహా యితర విప్లవ రచయితలను అరెస్టుచేయడాన్ని ఖండించారు. వివేకానంద ప్రతిపాదించిన తీర్మానాలద్వారా విప్లవ రచయితలను దేశభద్రతాచట్టంకింద అరెస్టుచేయబడ్డ మధురా యూనివర్సిటీ ప్రొఫెసరు 'సవ్యసాచిని'బేషరతుగా వెంటనేవిడుదలచేయాలని డిమాండ్‌చేశారు. సభకు ప్రొఫెసర్ వేణుగోపాలరావు అధ్యక్షతన జరిగింది.

* * *

ప్రభుత్వపు కుట్రలను బట్టబయలుచేస్తున్న విప్లవ రచయితల్ని కుట్రదారులుగా చిత్రించి కట్టుకటాలవెనక్కి నెట్టిన ఆంధ్ర ప్రభుత్వపు పచ్చి నియంతృత్వ విధానాన్ని ఖండిస్తూ చిత్తూరుజిల్లా విరసం యూనిట్, పౌరహక్కుల సంఘం, తిరుపతి రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ వారి విడుదలను డిమాండ్ చేశారు-

* * *

భావ సాయుధులైన విప్లవకవుల కలాల్ని, గళాల్నీ కుట్రకేసుల్లో యిరికించినా వీస్తున్న విప్లవ ఝంఝ ఆగదు- ప్రజాస్వామిక శక్తులన్నీ సంఘటితమై ప్రజోద్యమాలు సాగించి కుట్రకేసును భగ్నంచేయవలసిందిగా ప్రకాశంజిల్లా విరసంశాఖ విజ్ఞప్తి చేసింది-

విప్లవ రచయితల బంధించినా గాలిమీద గీతాలురాసి జనం గుండెల్లో ప్రసారం చేస్తారు, మేధావులూ, యువజనులూ, ప్రజాస్వామ్యవాదులందరూ ప్రభుత్వ దుష్టచర్యను ఖండించవలసిందిగా కదిరి సామ్యవాద సాహితీ సమితి కోరుకున్నది-

ప్రజాస్వామ్యంపేరుతో ప్రజాద్రోహంచేసే ఈ కుటిల ప్రభుత్వ కుట్రలను భగ్నంచేసి ప్రజా కవుల విడుదలకై పోరాడవలసిందని చీరాల 'సృజన' ఆర్ట్స్ కార్యదర్శి కె.యస్. రాజు కోరుతున్నారు-

## విప్లవ రచయితల అరెస్టులకు నిరసనగా 'హుజూరాబాద్ బంద్'

విప్లవ రచయితల విడుదలను డిమాండ్‌చేస్తూ 23-7-'74 న 'హుజూరాబాద్ బంద్' విజయవంతంగా జరిగింది-

హోటళ్ళు, దుకాణాలు మొదలగు వ్యాపారసంస్థలన్నీ మూసివేశారు- స్థానిక జూనియర్ కళాశాల, హైస్కూల్, ప్రాథమిక పాఠశాలల విద్యార్థులు తరగతులను బహిష్కరించి బ్రహ్మాండమైన ఊరేగింపు తీశారు- 3 గం.పాటుసాగిన ఈ ఊరేగింపులో వేయిమంది విద్యార్థులు పాల్గొని 'విప్లవం వర్ధిల్లాలి' 'విరసం వర్ధిల్లాలి' 'బూర్జువా బానిస విద్యావిధానం నశించాలి' ''విప్లవ రచయితలను విడుదల చేయాలి' 'జీనా హైతో మర్నా సీఖో, కదం కదంపర్ లడ్నా సీఖో' వంటి నినాదాలు చేశారు- తరువాత విద్యార్థి సంఘం కరీంనగర్ కలెక్టర్‌కు ఒక మెమొరాండం పంపించింది-

19-7-74 న జమ్మికుంట కళాశాల, (డిగ్రీ మరియు జూనియర్) హైస్కూల్ విద్యార్థులు తరగతులను బహిష్కరించి ఊరేగింపు తీశారు- "విప్లవ రచయితల విడుదలచేయాలి" "చారుబాబు అమర్ హై" అంటూ నినాదాలు చేశారు-

విప్లవ రచయితల అరెస్టు ప్రభుత్వ దమననీతికి, మూర్ఖత్వానికి, ప్రతిబంధమని హుజూరాబాద్ 'ప్రగతిశీల విద్యార్థులు' ప్రచురించిన కరపత్రంలో పేర్కొన్నారు-

ఇంకా విప్లవ రచయితలను విడుదలచేయాలని 'జనసాహితీ' సాహిత్య సంస్థ హుజూరాబాద్, భారత చైనా మిత్రమండలి హుజూరాబాద్ శాఖ, తాలూకాలోని అనేక యువజన సంఘాలు తీర్మానించినవి-

విప్లవ రచయితల అరెస్టుకు నిరసనగా 'మహబూబాబాద్‌బంద్' విజయవంతంగా జరిగింది. స్థానిక విద్యాసంస్థల విద్యార్థులు తరగతులను బహిష్కరించారు.

* * *

1-8-74 న చందా కాంతయ్య మెమోరియల్ కాలేజీ విద్యార్థులు ఆ కళాశాల ఉపన్యాసకులు, విప్లవ రచయిత అయిన శ్రీ వరవరరావు అరెస్టుకు నిరసనగా తరగతులను బహిష్కరించి విప్లవ నినాదాలుచేసుకుంటూ పోయి వారిని విడుదలచేయాలని జిల్లా కలెక్టరుకు మెమోరాండం యిచ్చారు.

విప్లవ రచయితల, విద్యార్థి నాయకుల అరెస్టులను ఖండిస్తూ విరసం నగరశాఖ పక్షాన 7-7-74 ఆదివారం సనత్‌నగర్‌లో జరిగిన బహిరంగసభలో పత్తిపాటి వెంకటేశ్వర్లు, జి. లింగారెడ్డి, జి. కోటేశ్వరరావు మొదలగువారు ప్రసంగించారు. భూమన్ అధ్యక్షత వహించారు- జన నాట్యమండలి సాంస్కృతిక కార్యక్రమాలు జరిగినవి- 14-7-74 న విద్యానగర్‌లో జరిగిన బహిరంగసభలో శ్రీ పత్తిపాటి వెంకటేశ్వర్లు మాట్లాడారు. జననాట్యమండలి కార్యక్రమాలు జరిగినవి-

## సాయుధ విప్లవం తప్పదు :

విప్లవ రచయితల సంఘం, రాష్ట్ర పౌరహక్కుల సంఘం, భారత చైనామిత్ర మండలి, ఆం.ప్ర.శాఖ సంయుక్తంగా హైదరాబాద్ ఆంధ్ర సారస్వత పరిషత్‌హాలులో 29–7–74 న నిర్వహించిన బహిరంగసభలో ప్రఖ్యాత కథకులు శ్రీ కాళీపట్నం రామారావు, శ్రీ కొల్లా వెంకయ్య, శ్రీ కాశీపతి, శ్రీ భూమన్, శాసనసభ్యులు శ్రీ సి.వి.కె. రావు, శ్రీ ఎన్. వెంకటరత్నం, శ్రీ పాపిరెడ్డి తెలంగాణా ప్రజాసమితి అధ్యక్షులు శ్రీ సత్యనారాయణరెడ్డి శాసనమండలి సభ్యులు శ్రీ మార్పు బాలకృష్ణమ్మ ప్రసంగిస్తూ దేశంలో ముఖ్యంగా రాష్ట్రంలో జరుగుతున్న నిర్బంధకాండను, కుట్రకేసులను విరసం సభ్యుల అరెస్టులను ఖండించారు. ప్రభుత్వం ప్రజల సమస్యలు పరిష్కరించకపోతే సాయుధ విప్లవం తప్పదని హెచ్చరించారు– 'సాయుధ విప్లవం వర్థిల్లాలి', 'భూమయ్య కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలు రద్దుచేయాలి' వంటి నినాదాలతో సభాస్థలం మారుమోగింది– జననాట్యమండలి సాంస్కృతిక కార్యక్రమం జరిగింది– సుమారు 3000 జనం సభలో పాల్గొన్నారు. విరసం అధ్యక్షులు శ్రీ శ్రీ సభకు అధ్యక్షత వహించారు. రాష్ట్ర పౌర హక్కుల సంఘ కార్యదర్శి శ్రీ పత్తిపాటి వక్తలను ఆహ్వానించారు.

30–7–74 న బొలారంలో విద్యార్థి యువజన సంఘాలపక్షాన జరిగిన బహిరంగ సభలో శాసనసభ్యులు శ్రీ పాపిరెడ్డి, సికింద్రాబాద్ పౌరహక్కుల సంఘం అధ్యక్షులు శ్రీ జి.ఎం. అంజయ్య, తెలంగాణా ప్రజాసమితి అధ్యక్షులు శ్రీ బి. సత్యనారాయణరెడ్డి శ్రీ పత్తిపాటి వెంకటేశ్వర్లు, శ్రీ శంకరయ్య, శ్రీ నర్సింగరావు మాట్లాడుతూ పోలీసుల దమనకాండను, అరెస్టులను ఖండించారు. జననాట్యమండలి సాంస్కృతిక కార్యక్రమం జరిగింది.

* * *

విప్లవ రచయితలను అరెస్టుచేసిన యీ ఫాసిస్టు ప్రభుత్వంపట్ల మా తీవ్రమైన నిరసన తెలియచేస్తూ వెంటనే విడుదల చేయవలసిందిగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నాం.

గురుమూర్తి, సెక్రటరి
ది ఇన్సూరెన్స్ కార్పోరేషన్ ఎంప్లాయీస్ యూనియన్,
బ్రాంచి యూనిట్: వరంగల్.

---

పోరాటం పాఠం, త్యాగం నీ యాగం
ఆకాశం ఆశయం, హృదయం సూర్యోదయం.

– కె. వి. ఆర్.

---

వార్తలు :

## పుస్తకాల అక్రమ స్వాధీనం :

కర్నాటక ప్రభుత్వం, మైసూరు పట్టణంలో 8-7-74 న 'మావో సూక్తిగాలు' (మావో సూక్తులు)అనే పుస్తకాన్ని నిషేధించి 1000 ప్రతులను స్వాధీనపరచుకొన్నది- ఈ చర్యను ఖండిస్తూ 'మంచూణి'ఎడిటర్ ఒక ప్రకటన విడుదలచేశారు- ప్రజాస్వామిక వాదులంతా కర్నాటక ప్రభుత్వపు యీ చర్య ఖండించాలని కోరారు.

*   *   *

వలపర్ల గ్రామంలో చెప్పులు కుట్టుకుని జీవిస్తున్న శ్రీ తాళ్లూరి కృష్ణారావుగారు తమ సొంతపనిపై శ్రీశైలంవెళ్ళగా అచ్చట పోలీసులు వారిని అక్రమంగా 5-7-'74 తేదీన అరెస్టుచేసి అద్దంకి పోలీసుస్టేషన్‌లో నాలుగురోజులు వుంచి ఆ తరువాత చిలకలూరిపేట ట్రావెలర్సు బంగళాకు తీసుకువెళ్ళి అచ్చట వారం రోజులు వుంచారు. ఆ తరువాత వారిని ఎక్కడకు తీసుకువెళ్ళింది తెలియటంలేదు ఇప్పటివరకు అతనిని ఏ కోర్టుముందు హాజరు పర్చలేదు. అతని ప్రాణానికి ఏమి హానిజరుగగలదో అని అతని తల్లిదండ్రులు భీతిచెందుచున్నారు. అతనిని వెంటనే కోర్టుముందు హాజరుపర్చవలసిందిగా గుంటూరు జిల్లా పౌరహక్కుల సంఘం డిమాండు చేస్తున్నది.

జి. కోటేశ్వరరావు, కార్యదర్శి
గుంటూరుజిల్లా పౌరహక్కుల సంఘం.

## హాస్టల్ విద్యార్థులపై పోలీసుల అత్యాచారం.

5-7-'74 న తమ యిబ్బందులు తెలుపుకునేందుకు హైద్రాబాద్ సోషల్ వెల్ఫేర్ హాస్టల్ విద్యార్థులు కలెక్టర్ కార్యాలయంముందు శాంతియుతంగా ధర్నా జరుపుతూండగా పోలీసులు లాఠీచార్జ్ జరిపారు- నిజామాబాద్ ప్రగతిశీల విద్యార్థి సంఘం పోలీసుల దౌర్జన్యాన్ని ఖండించి అరెస్టుచేయబడ్డ విద్యార్థుల విడుదలను డిమాండ్‌చేశారు-

## హరిజనులపై నిమ్మపల్లి భూస్వాముల దౌర్జన్యం

కరీంనగర్ జిల్లా సిరిసిల్ల తాలూకాకు చెందిన నిమ్మపల్లి గ్రామంలో హరిజనులు 20-6-74 నాడు తమ భూమిని దున్నుకుంటుండగా అవూరి భూస్వామి బొంతల రాఘవరావు కొడుకు హన్మంతరావు ట్రాక్టరు, గుండాలతో వచ్చి పేద హరిజనులమీద దౌర్జన్యంచేసి భూమిని అక్రమంగా ఆక్రమించటానికి ప్రయత్నించాడు ట్రాక్టరు ప్రజలమీదికి తోలటంవల్ల నల్గురు గాయపడ్డారు. వెట్టిచేయలేదన్న కసితో హరిజనులను గుండాలతో కొట్టించాడు. హరిజనులను, వారికి సానుభూతి ప్రకటించిన యితర ప్రజలను ఊరినుండి తరిమివేయించాడు. ప్రస్తుతం వాళ్లు ఇతర గ్రామాలలో తలదాచుకొంటున్నారు. సిరిసిల్ల నుండి జీపుల్లో గూండాలను తీసుకొచ్చి భీతావహాన్ని సృష్టిస్తు

న్నారు. పోలీసులను తీసుకవచ్చి బెదిరిస్తూ అక్రమకేసుల బనాయింపుకు ప్రయత్ని స్తున్నారు.

భూస్వామి రాఘవరావు అనేకమంది అమాయకులను కమ్యూనిష్టులన్న పేరుతో చంపించాడు. ఎంతోమందిని కొట్టించాడు. ఇతని కొడుకులు హన్మంతరావు భాస్కర రావు, ప్రకాశరావులు దౌర్జన్యానికి మారుపేర్లు. గత సంవత్సరం ప్రజలకు ప్రేమ పాత్రుడైన డాక్టరు శ్రీహరిని దారికాచి చంపించారు. ఒక గొల్లాయనను తమకు జీత ముండలేదనే కసితో చిత్రహింసలకు గురిచేసి చంపారు. విప్లవపాటల పుస్తకాలు తెప్పించుకొని చదివినందుకు దేవయ్య అనే యువకుణ్ణి ఇంకా ఎందరో పేదలను కార ణాలు బనాయించి కొట్టించారు. వెట్టిచాకిరి చేయటం, వెట్టి నాగళ్ళు కట్టడం వెట్టి గొర్రెలు యివ్వటంవంటి అనేక బాధలు భరించలేక ప్రజలు కుతకుతలాడి పోతున్నారు. హరిజనులపై భూస్వాములు జరుపుతున్న దౌర్జన్యాలను ఖండించాల్సిందిగా వారు తమ భూమిని రక్షించుకోవటంకోసం దౌర్జన్యాన్ని ప్రతిఘటిస్తూ సాగిస్తున వీరోచిత పోరా టాన్ని బలపర్చవలసిందిగా ప్రజలందరికి విజ్ఞప్తి చేస్తున్నాం.

సిరిసిల్ల తాలూకా రైతుకూలీ సంఘం,
కరీంనగర్ జిల్లా.

కొత్తగూడెంలో చారుబాబు వర్ధంతి సందర్భంగా పోస్టర్లు వెలిశాయి. చారుబాబుచిత్రంతోబాటు వాటిమీద ఇలా వ్రాసివుంది. "సాయుధ విప్లవం వర్ధిల్లాలి! నక్సల్‌బరి నిర్మాతకు జోహార్లు! అమరవీరుడు కామ్రేడ్ చారు మజుందారుకు విప్లవ జోహార్లు! అన్యాయాల్ని బోనెక్కించి, ఆయుధానికి అ ఆ లు నేర్పినవాడా జోహార్లు!"

"దోపిడీ ప్రభుత్వపు నిజస్వరూపం తెల్సుకోండి ట్రేడ్‌యూనియన్ నాయకులమోసా లను భగ్నంచేయండి"అనే శీర్షికతో 'కొత్తగూడెం ప్రగతిశీల విద్యార్థులు' చారుమజుం దార్ వర్ధంతి సందర్భంగా కరపత్రాలు పంచిపెట్టారు.

* * *

"...వరవర్, ఖాన్, చెరబండరాజు వగైరా యువకులను పార్వతీపురం పద్ధతి కుట్ర కేసులో ఇరికించింది...... మ. ఘ. ప్రభుత్వం వుద్దేశ్య ప్రకారం నాలుగైదేళ్ళు మన వాళ్ళు సికింద్రాబాద్ కుట్రకేసులో పడివుంటారు. తర్వాత కోర్టు తీర్పు ఎలావున్నా ఇబ్బంది లేదు. ఏవిధంగా ఆలోచించినా ప్రభుత్వం స్వయంగా అందరినీ ఆయుధాలు పట్టుడంతప్ప గత్యంతరంలేదు అనే చిత్తవృత్తికి దారితీస్తున్నది. ఇటువంటి పరిస్థితిని కల్పిస్తున్న ప్రభుత్వం మీద "డెమాక్రసీని కూలతోసే కుట్ర" చేస్తున్నారని కోర్టులో పెట్టే అవకాశం వున్నదేమో "రాజ్యాంగ ప్రవీణు" ఆలోచించాలె. Test Case!.....

"...ప్రజాదరణ కోల్పోయికూడా యీ ప్రభుత్వం నినాదాలతో ప్రజను ఎన్నాళ్లు ఏలు తుందో ? ఇంకా ఏంచేస్తే ఈ ప్రజ, అంటే 'నీవు నేను'తోసహా రేగి తిరగబడతామో?"

—కాళోజీ

## అంకుశాపురం రైతు కూలీల సమ్మె - పాక్షిక విజయం

హైద్రాబాద్ జిల్లా అంకుశాపురం గ్రామంలో సుమారు 150 మంది పాలేర్లు భూస్వాముల నిరంతర దోపిడికిగురై, 24 గం. రెక్కలు విరుచుకున్నా పూటకింతతిండి కరువై 'మా బతుకులు యింతే' అనుకునే సమయంలో అక్కడి 'యువజన సంఘం' వారిలో రగిలించిన చైతన్యంతో 'రైతుకూలీ సంఘం'పెట్టి కూలిరేటు పెంపుదల మొద లగు సౌకర్యాల డిమాండ్నోటీసు వారంరోజులగడువుతో గ్రామసర్పంచ్కు అందించారు. భూస్వాములు యీ నోటీసును నిర్లక్ష్యంచేయడంతో రైతుకూలీలు 31-5-'74 న సమ్మె ప్రారంభించారు- 150 మంది పాలేర్లు పనులన్నీ వదులుకొని సమ్మెలోకిదిగారు- రైతు కూలీల ఐక్యత విచ్ఛిన్నం చేయడానికి భూస్వాములు విశ్వప్రయత్నం చేశారు. పోలీ సుల పిలిపించుకొన్నారు- నక్సలైట్లువచ్చి ప్రజల్ని తమపైకి రెచ్చగొడుతున్నారని సీయార్పీక్యాంపుకూడా పెట్టించుకున్నారు- భూస్వాములు యువజనసంఘ నాయకులను అరెస్టుచేయించే ప్రయత్నాలు కూడా చేస్తున్నారు. ఇన్నిచేసినా చలించని రైతుకూలీలు రెండవసారి సమ్మెపిలుపు యివ్వడంతో భూస్వాములు దిగివచ్చి బతిమాలి 16-6-74 న జరిగిన బహిరంగసభలో వారి కోరికలను గుర్తించారు-

రైతు కూలీ సంఘం, అంకుశాపురం.

## రాష్ట్రవ్యాపితంగా పోలీసుల దమనకాండ

5-7-'74 న వరంగల్కు చెందిన శ్రీ రాజమౌళిని అతని ఇంట్లో, అదే తేదీన శ్రీశైలంవద్ద అద్దంకి తాలూకా రామపురానికిచెందిన తాళ్లూరి కృష్ణారావును, 12-7-74న వరంగల్ జిల్లా మానుకోటతాలూకా బంజారగ్రామనివాసి శ్రీ జనార్దన్ అనబడే సి. హెచ్. నర్సయ్యను పోలీసులు అరెస్టుచేశారు. పై ముగ్గురిని ఇంతవరకు ఏ కోర్టులోనూ హాజరు పరుచక చట్టవిరుద్ధంగా పోలీసుకస్టడిలో ఉంచారు. వారిని వెంటనే కోర్టులో హాజరు పరువాలని డిమాండ్ చేస్తున్నాం-

* * *

6-7-74న రాజమండ్రి స్టేట్ జెయిలులో ఉన్న నక్సలైట్ ఖైదీ బిడ్డిక సింగా రమ్మను అక్కడి వార్డరులు, పరిచారికలు కొట్టారని తెలుస్తున్నది. రాజమండ్రిసెంట్రల్ జెయిలు నక్సలైట్ ఖైదీలు శ్రీ ఎం. పుల్లారెడ్డి, శ్రీ పులి శ్రీనివాసులు, శ్రీ వీరయ్య రెడ్డి యీ డిమాండ్లతో నిరవధిక నిరాహారదీక్ష సాగిస్తున్నారు. 1) బిడ్డిక సింగారమ్మ ను కొట్టినవార్డర్లను, పరిచారికలను సస్పెండ్చేయాలి. 2) సింగారమ్మకు ఇంటర్వ్యూ

అవకాశాలను కలుగచేయాలి. 3) రేషన్ సక్రమంగా పంపిణీ చేయాలి. 4) స్టేట్ జెయిలు ఖైదీలకు గుడ్డలు సప్లయిచేయాలి. 5) వారి పిల్లలకు తగిన ఆహారం గుడ్డలు యివ్వాలి. బిడ్డిక సింగారమ్మను కొట్టిన వార్డెర్లను, ఇతరులను విచారణజరిపి శిక్షించాలనీ నక్సలైట్ ఖైదీల కోరికల వెంటనే తీర్చాలనీ డిమాండ్ చేస్తున్నాం–

నెల్లిమర్ల జనపనార మిల్లుకు చెందిన నలుగురు కార్మికుల కాల్చి చంపడమేకాక 36 గురు కార్మికుల అరెస్టుచేసిన పోలీసుల కిరాతకచర్యలను మేము తీవ్రంగా ఖండిస్తున్నాం– దోపిడీదార్లయిన యజమానులకూ దోపిడీకిగురైన కార్మికులకూ సంఘర్షణ జరిగిన సందర్భాల్లో ఎప్పుడైనా యజమానికి ఒక్క తుపాకీగుండు తగిలిన ఉదంతం వున్నదా? ప్రభుత్వపు పైశాచిక ఫాసిస్టు విధానానికి, దోపిడీవర్గ పక్షపాతానికి యిది తిరుగులేని ఉదాహరణ–

పత్తిపాటి వెంకటేశ్వర్లు, కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పౌరహక్కుల సంఘం.

---

## ప్రస్తుతం సృజనవద్ద అమ్మకానికి సిద్ధంగావున్న పుస్తకాలు

1. అమరవీరుల జీవిత చరిత్రలు— ... 3—00
2. రాష్ట్ర విభజనోద్యమం— మా లె. దృక్పథం— ... 0—15
3. చారుమజుందార్ సంస్మరణ కవితలు— ... 0—80
4. ఉప్పెన— నవల మొదటిభాగం— ... 2—50
5. ఎరుపు— విరసం సంచిక మే '74 ... 2—00
6. ఎరుపు— విరసం సంచిక జూలై '74 ... 2—25
7. విమర్శలు—ఆత్మవిమర్శ—కె. వి. రమణారెడ్డి— ... 0—40
8. వైరుధ్యాలు — మావో సేటుంగ్ ... 0—50
9. జనం ఊపిరిలో — ఖైదీగీతం ... 0—50
10. ఊరేగింపు — వరవరరావు— ... 1—25
11. తూరుపు — ఉద్యమవేగాన్నందుకున్న కొత్త కథలు— ... 1—00
12. ఎర్రమందారాలు — "నిజం" — ... 1—00
13. చైనా కమ్యూనిస్టుపార్టీ 30 సం॥ల చరిత్ర— ... 1—75
14. రెడ్ శాల్యూట్ — కాశీపతి— ... 0—75
15. లాంగ్‌మార్చ్‌లో చైర్మన్ మావోతో— ... 1—50
16. అధ్యయనం — మావో— ... 0—25
17. దిగంబర కవులు — కవితాసంపుటి— ... 5—00
18. జీవనాడి — వరవరరావు ... 2—00
19. నగారా — అరుణోదయ గేయాలు ... 2—50
20. 'ఉదయం' వి బి. గద్దర్ పాటల సంచిక ... 0—30
21. తిరుగుబాటు — ఖమ్మం విరసం ప్రచురణ— ... 1—25
22. అడివంటుకుంది— భూషణం కథలు— ... 1—25
23. మైత్రి—భారత—చైనా మిత్రమండలి మే '74 సంచిక— ... 1—00
24. నాకుటుంబం— నవల— టావ్ చెంగ్— ... 2—00
25. జనసేనపాటలు—జనసేన— ... 1—00
26. ఎర్రపిడికిలి— కె. వి రమణారెడ్డి— ... 3—00
27. అ ర.సం. కాయకల్ప చికిత్స ??— కె వి. ఆర్. ... 1—25
28. విరసం— 3వ మహాసభల ప్రత్యేక సంచిక— ... 2—00
29. గమ్యం— చెరబండరాజు పాటలు— ... 2—00
30. కళలూ, సారస్వతం ఎవరికోసం?— మావో సెటుంగ్ ... 0—65
31. నక్సల్బరి— విప్లవగేయాలు— ... 1—50
32. రేపటి కవిత్వం— జ్వాలాముఖి సిద్ధాంత గందరగోళం ... 0—75
33. కాళీపట్నం రామారావు కథలు— ... 2—50

పై పుస్తకాలు కావాలన్నా ఇవేకాక సృజన పాత సంచికలు కావలసినా ముందుగా (అడ్వాన్సుగా) డబ్బు M. O. ద్వారా పంపించాలి. పోస్టుఖర్చులుకూడా మీరే భరించుకోవాలి.

SRJANA Telugu Monthly Aug. '74 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67

'ఎరుపు' – జులై '74

విరసం సంచిక – 2

వెలువడింది.

సంపాదకుడు : కె. వి. రమణారెడ్డి

వెల : 2-25

ప్రతులకు : సృజన. హనుమకొండ. వరంగల్. 506001

నోటు :– 'ఎరుపు' సంచిక 1 కాపీలుకూడా వున్నాయి. వెల: 2-00
డబ్బు పోస్టేజీకూడా కలిపి ముందుగా పంపించాలి.

రానున్నది కానున్నది

'మైత్రి'

భారత–చైనా మిత్రమండలి సంచిక

'మైత్రి' పాతకాపీలు సృజనవద్ద దొరుకుతాయి.

వెల : 1-00

SRJANA
Hanamkonda
Warangal 506001

1 Re.